# వీక్షణం

veekshanam fortnightly

ఆర్థిక, సామాజిక పక్షపత్రిక

సంపుటి: 1 సంచిక: 17 | సమతా పబ్లికేషన్స్ ప్రచురణ | ఆగష్టు 1-15, 2004




లోపలి పేజీల్లో...




విడి ప్రతి: రూ॥ 6/-
వార్షిక చందా:రూ॥140/-లు


సంపాదకీయం:

## మళ్ళీ ఆగస్ట్ 15

'స్వతంత్ర భారతవర్ష వాస్తవ్యుడా మానవుడు
అతికించండి అతడి ముఖానికి చిరునవ్వు'

అని శ్రీశ్రీ రాసి యాభై ఏళ్లు గడిచిపోయింది. 'ఏండ్లు మారెను ఏమి మారిందని' అని చెరబండరాజు నిర్వేదం ప్రకటించి మూడుదశాబ్దాలు గడిచిపోయింది. వయసు వచ్చినట్లు, ప్రతిఏటా తద్దినం వచ్చినట్టు ఆగస్ట్ 15 ప్రతి సంవత్సరం వస్తూనే ఉంది. 'సకల ప్రపంచమూ నిద్రపోతున్నప్పుడు, ఒక ఉజ్వల భవిష్యత్తులోకి భారతదేశం మేలుకుంటోంది' అని జవహర్‌లాల్ నెహ్రూ 1947 ఆగస్ట్ 14 అర్ధరాత్రి పలికిన చరిత్రాత్మక ఆశాభావం యాభై ఏడు సంవత్సరాల తర్వాత కూడా నిజం కాలేదు. ఏ ఆకాంక్షలతో బ్రిటిష్ వలసవాదాన్ని ఈ నేలమీది నుంచి తరిమి వేశామో, ఏ ప్రజా శ్రేయస్సు పునాదిగా రెండువందల సంవత్సరాలపాటు వేలాదిమంది యోధులు ప్రాణాలు బలిపెట్టి ఉద్యమం నిర్మించారో ఆ ఆకాంక్షలు, ఆ ప్రజా ప్రయోజనాలు ఇవాల్టికీ నెరవేరని కలలుగానే మిగిలిపోయాయి. ఆకలి, రోగం, దఃఖం, నిరుద్యోగం లేని ప్రపంచం గురించిన వాగ్దానాలు ఇంకా అసంపూర్ణ వాగ్దానాలుగానే మిగిలిపోయాయి. అభివృద్ధి జరగనే లేదని కాదు. రంగుల టీవీలు, అద్దాల వంటి రోడ్లు, అత్యాధునిక సౌకర్యాలు, మొబైల్ ఫోన్లు, పంచభక్ష్య పరమాన్నాలు ఈ దేశంలోనూ ఉన్నాయి. అది ఏ పిడికెడు మందికో అందుతుండగా, రెండుపూటలా భోజనం దొరకని జనాభా మూడోవంతు కన్నా ఎక్కువ ఉంది. కనీస విద్యా, వైద్య, ఆరోగ్య సౌకర్యాలు అందని జనాభా సగంకన్న ఎక్కువే ఉంది. దేశంలోని వ్యవసాయయోగ్యమైన భూమినంతటినీ సాగులోకి తెచ్చి ఆహారధాన్యాల ఉత్పత్తి పెంచడం, దేశీయ మార్కెట్‌ను పెంచి, దాన్ని తీర్చే పారిశ్రామిక వ్యవస్థను పెంపొందించి, ఇతోధికంగా ఉద్యోగ కల్పన సాధించడం, ప్రజల కనీసావసరాలు తీర్చడంతో పాటు, వినోద, విజ్ఞాన అవసరాలు తీర్చడం, సామాజిక అనాచారాలను రద్దుచేయడం-ఒక్క మాటలో చెప్పాలంటే రాజ్యాంగ నిర్మాతలు ఆదేశిక సూత్రాలలో పొందుపరచిన ఆదర్శాలను అందుకోవడం ఐదు దశాబ్దాల తర్వాత కూడ జరగలేదు. పైగా గత దశాబ్దంగా సాగుతున్న నూతన ఆర్థిక విధానాలు అటువైపు కూడ వెళ్లకుండా భారత రాజకీయార్థిక వ్యవస్థ దిశనే మార్చివేశాయి. 2004 జనాదేశం పాలకవర్గాలను ఒక కుదుపు కుదుపినట్టు కనిపించినప్పటికీ, ఉమ్మడి కనీస ప్రణాళికలో ప్రజా ప్రయోజనాలకు స్థానం దొరికినప్పటికీ మళ్ళీ ప్రభుత్వాలు వ్యతిరేక దిశలోనే నడుస్తున్నాయి. ఈ పరిస్థితిలో ఈ ఆగస్ట్ 15 అయినా, వలస వ్యతిరేక జాతీయోద్యమ ఆకాంక్షలను, ఆదర్శాలను, ప్రజా ప్రయోజనాలను మన ముందుకు తీసుకురావాలి.

ఫోకస్: నిరుద్యోగం
వచ్చే సంచికలో: 100 రోజుల కాంగ్రెస్‌పాలన

# పంద్రాగస్ట్

- తరిమెల నాగిరెడ్డి

**(అగష్టు 15న భారతదేశం స్వతంత్ర దేశంగా అవతరించిందా? ఈ ప్రశ్నకు జవాబు ప్రముఖ కమ్యూనిష్టు నాయకుడు కీ.శే.తరిమెలనాగిరెడ్డి మాటల్లో -సం)**

వలసపాలకుల నుండి భారత బూర్జువా వర్గానికి అధికార మార్పిడి ఏ విధంగా జరిగింది? ఈ "శాంతియుత మార్పిడి"కి దారితీసిన పరిస్థితులేమిటి? గాంధీకి ఆయన అనుచరులకు బ్రిటీష్‌వారు కృతజ్ఞులుగా ఉండటానికి దారితీసిన కారణాలేమిటి? భారత ప్రజానీకానికి సంబంధించినంతవరకు ఈ అధికార మార్పిడి యొక్క ప్రాధాన్యత ఏమిటి? ప్రస్తుతం నాపై మోపబడిన కేసు ప్రాధాన్యతను అర్థం చేసుకోవాలంటే ఈ సమస్యలను కొన్నింటిని పరిశీలించాల్సి ఉంటుంది.

రెండవ ప్రపంచ యుద్ధం ముగింపు పెట్టుబడిదారీ విధానపు సాధారణ సంక్షోభాన్ని తగ్గించడానికి బదులుగా దాని అన్ని లక్షణాలను మరింత తీవ్రతరం చేసింది. ఫాసిజం ధ్వంసం కావడం, ఫాసిజాన్ని ఓడించటంలో స్టాలిన్ నాయకత్వాన సోవియట్ యూనియన్ నిర్వహించిన చారిత్రాత్మక పాత్ర, చైనా కమ్యూనిస్టు పార్టీ, కామ్రేడ్ మావోసేటుంగ్ నాయకత్వాన చైనా విప్లవం అప్రతిహితంగా పురోగమిస్తూ విజయం చేరువలో ఉండటం- ఇవన్నీ వలస పాలనకు వ్యతిరేకంగా దక్షిణ ఆసియా దేశాలన్నింటిలోనే కాక, పశ్చిమ ఆసియా, ఆఫ్రికా దేశాలలో సైతం విమోచనోద్యమాలు పెల్లుబుకడానికి నిర్ణయాత్మకమైన ప్రోత్సాహాన్నిచ్చాయి. రెండవ ప్రపంచ యుద్ధంలో విజయం పొందిన సామ్రాజ్యవాద దేశాల, ముఖ్యంగా బ్రిటన్, ఫ్రాన్స్‌ల శక్తి, పరువు ప్రతిష్టలు క్షీణించడం, శ్రామికవర్గ రాజ్యమైన సోవియట్ యూనియన్ ఒక బలీయమైన అంతర్జాతీయ శక్తిగా ముందుకు రావడం, వలస దేశాలన్నింటిలోనూ విమోచనోద్యమాలలో గర్భితమై వున్న విప్లవ శక్తులను వెలికిలాగి బ్రహ్మాండంగా పురోగమించేలా చేశాయి.

అలాంటి చారిత్రక అంతర్జాతీయ పరిస్థితుల్లోనే రెండవ ప్రపంచ యుద్ధానంతరం భారతదేశంలో కోట్లాదిమంది ప్రజలు వెల్లువలాగా పోరాటాల్లోకి కదలడం చూశాము. అజాద్ హిందూ ఫౌజ్ (INA) సైనికులపై విచారణకు వ్యతిరేకంగా సాగిన మిలిటెంటు నిరసన ప్రదర్శనలు; అన్ని వర్గాలను, కులాలను, జాతులను మిలిటెంటు పోరాటాల్లోకి సమైక్యం చేసిన రాయల్ ఇండియన్ నావికాదళ శ్రేణుల మహత్తర తిరుగుబాటు, సైన్యంలోను, విమాన బలగంలోనూ కన్పించిన బహిరంగ తిరుగుబాటు సూచనలు- ఇవన్నీ భారతదేశంలో విమోచనోద్యమం మరింతగా పరిక్వమవుతోందని వెల్లడి చేశాయి. దేశ వ్యాపితంగా శ్రామికవర్గం తన కాళ్ళపై లేచి నిలబడింది. ఉధృతమైన రాజకీయ సమ్మెలు, నిత్యకృత్య మయ్యాయి. దేశంలో రాజుల, నవాబుల పాలన క్రింద ఉన్న ప్రాంతాలలో అశేష ప్రజానీయం, ప్రత్యేకించి రైతాంగం ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా పోరాటంలో ముందుకు సాగుతున్నది. ఆ విధంగా భారతదేశంలో ఉద్యమం మొట్టమొదటిసారిగా పౌరజనంలోనే కాక, సాయుధ బలాల మధ్య కూడా వెల్లువలా పురోగమించింది.

దీనితో బ్రిటీష్ పాలకులు వణికిపోయారు. భారత బూర్జువావర్గ నాయకత్వం భయవిహ్వల మయింది. ఈ రెండు శక్తులు ఏకమై శతాధిక సంవత్సరాల పాటు దేశాన్ని పాలించిన సామ్రాజ్యవాదాన్ని తరతరాల ఫ్యూడల్ అర్థబానిసత్వాన్ని సమూలంగా తుడిచివేసే బ్రహ్మాండమైన శక్తిగా అభివృద్ధి చెదుతున్న ప్రజాబాహుళ్యాల, సాయుధ బలగాల ఐక్యతను విచ్ఛిన్నం చేసి, నాశనం చేయడానికి పూనుకున్నాయి. ఇది భారతదేశంలో నూతన శకానికొక సంకేతం అయింది. బ్రిటీష్ పాలన యొక్క పునాదులు, దాని అధికార యంత్రాంగం చిన్నా భిన్న మవడం స్పష్టంగా వెల్లడయింది. ఎన్నడూ ఊహించని విధంగా లేస్తున్న ఈ ప్రజా తిరుగుబాట్ల పర్యవసానాలకు భయపడి వణికిపోయిన భారత బూర్జువావర్గం విద్రోహంవైపు త్వరితంగా నడిచింది.

1946 ఫిబ్రవరి 21 న తిరుగుబాటు చేస్తున్న నావికాదళంపై కాల్పులు జరపడానికి భారత సైనికులు తిరస్కరించినపుడు బ్రిటీష్ సైన్యాలు రంగంలోకి దింపబడ్డాయి. ఆ సమయంలో అడ్మిరల్ గాడ్ ఫ్రే "నావికాదళం సర్వనాశనం అయినా సరే ప్రభుత్వాధీనంలో వున్న అసంఖ్యాక బలగాల్ని పెద్ద ఎత్తున వినియోగించగలం" అని హెచ్చరిక చేశాడు. కాంగ్రెసు "ఉక్కు మనిషి" అయిన వల్లభాయ్ పటేల్ నావికా తిరుగుబాట్లను ఖండించి, "నావికాదళంలో క్రమశిక్షణ వుండి తీరవలసిందేనన్న" ప్రధాన సైన్యాధికారి వ్యాఖ్యానానికి తన ఆమోదాన్ని తెలిపాడు. విమోచనా పోరాటానికి అంతిమంగా విద్రోహం చేసిన ఈ చివరి దశలో కాంగ్రెసు సంస్థ అధ్యక్షుడుగా నున్న మౌలానా అజాద్ "ప్రస్తుత అధికారానికి వ్యతిరేకంగా సమ్మెలు, హర్తాళ్ళు, ధిక్కరణలకు స్థానం లేదని" ప్రకటించాడు. ఈ మహత్తర తిరుగుబాటులో ప్రదర్శితమైన హిందూ ముస్లింల ఐక్యతను, దానిపట్ల ప్రజల్లో పెల్లుబికిన విస్తృతమైన మిలిటెంటు అండదండలను "అపవిత్ర కూటమి" గా ఖండించడం ద్వారా దానిపై మహాత్మాగాంధీ చివరిదెబ్బ తీశాడు. గాంధి ఇలా అన్నాడు. " ఆ తిరుగుబాటు భారతదేశాన్ని అల్లరిమూకల చేతుల్లోకి నెట్టి ఉండేది. ఇలా జరగడాన్ని స్వయంగా చూడడానికి 125 సం॥ల పాటు జీవించడంకంటె మంటల్లోపడి నాశనం కావడానికే నేను ఇష్టపడతాను" దినదినం పెరుగుతున్న వివిధ తరగతుల ప్రజల విప్లవ కార్యాచరణ పట్ల ఉన్నత వర్గాలలో గల భయాన్ని ఎంతో తేటతెల్లంగా బయటపెడ్తున్న మాటలివి.

స్రామాజ్యవాదానికి వ్యతిరేకంగా బూర్జువావర్గం నిర్ణయాత్మక విజయాన్ని కాంక్షించలేదని దీనితో స్పష్టమౌతుంది. స్రామాజ్యవాద వ్యతిరేక ప్రజాతంత్ర విప్లవాన్ని తుదికంటా కొనసాగించటం బూర్జువా వర్గానికి చేతకాదని కూడ స్పష్టమైపోయింది. వారి దృష్టిలో ''అల్లరిమూకల'' యిన శ్రామిక వర్గాన్ని, రైతాంగాన్ని అణిచివేయడానికి, బ్రిటీష్ స్రామాజ్యవాదం తన వంద సం॥ల పైగా జరిపిన పాలనలో పెంచి పోషించిన నిరంకుశ పాలనా యంత్రాంగం, దాని మిలిటరీ పోలీసు బలగాలు ఇపుడు భారత బూర్జువా వర్గానికి చాలా అవసరమయ్యాయి. అందుకనే ఈ యంత్రాంగం ధ్వంసం చేయబడటం వారికి ఏమాత్రం ఇష్టం లేదు.

ఆ విధంగా స్రామాజ్యవాదంతో నీచమైన రాజీకి కృషి ప్రారంభమైంది. అంతిమంగా ద్రోహం చేయడానికే వారు సిద్ధమయ్యారు. అదే విధంగా విప్లవ శక్తుల్ని చూసి భారత బూర్జువావర్గం ఎంతగా భయపడిందో, అంతగా స్రామాజ్యవాదం కూడా తన అంతిమ నాశనం పట్ల భయవిహ్వలమైంది. బలప్రయోగంతో భారతదేశ పరిస్థితిని అదుపులో పెట్టడం సాధ్యం కాదని స్రామాజ్యవాదం అర్థం చేసుకొన్నది. ఆ సమయంలో తిరుగుబాటు జ్వాలలతో అట్టుడికిపోతున్న దేశంలో బ్రిటీష్ అధికారాన్ని నిలబెట్టడానికి గణనీయమైన అదనపు బలగాలని దించే స్థితిలో యుద్ధంతో విసిగివేసారి ఆర్థికంగా చిన్నాభిన్నమైన బ్రిటన్ లేదని- భారతదేశ తూర్పు విభాగం కమాండ్ జి.ఓ.సి (ప్రధాన సైనికాధికారి) లెఫ్టినెంట్ జనరల్ సర్ ఫ్రాన్సిస్ టకర్ అభిప్రాయబడ్డాడు. ఆయన తన గ్రంథంలో (While Memory Serves-పేజీ 518) ఇలా వ్రాశాడు: "ఆర్థికంగా క్షీణించిన మా దేశం తాలూకు పారిశ్రామిక అవసరాలకన్నా ఈ సైన్యం పెంపుదల అవసరమని మించిపోయేదిగా, భరించలేనిదిగా ఉందని మేము అనుకొన్నాము. మేం భారతదేశాన్ని వదిలిపోవడానికి, అందులోనూ అంత త్వరగా పోవడానికి ఇది మరో బలమైన కారణం".

భారతదేశాన్ని అధీనంలో ఉంచుకోవడానికి "దేశీయాంగ శాఖను విపరీతంగా విస్తృత పర్చడం, బ్రిటిష్ సైన్యాలను విపరీతంగా పెంచడం అవసరమై ఉండేదని" అధికార మార్పిడి కొరకు రాజీ బేరాలు సాగించినవారిలో ముఖ్యుడైన సర్ స్టాఫర్డ్ క్రిప్స్ బ్రిటిష్ పార్లమెంటులో వెల్లడించాడు. ఈ ప్రత్యామ్నాయాన్ని ''త్రోసివుచ్చడానికి తనకు ఏ మాత్రం తటపటాయింపు లేకపోయింద''ని కూడా ఆయన వెలిబుచ్చాడు.

అందువల్లనే భారతదేశంలో తన ఆర్థిక, పారిశ్రామిక, వ్యాపార స్థానాలన్నింటినీ భద్రంగా రక్షించుకోవాలంటే రాజీ పడటం, ఈ ప్రాంతంలో తన రాజకీయాధిపత్యాన్ని వదులుకొనడం అవసరమని బ్రిటిష్ ప్రభుత్వం భావించింది.

ఆ విధంగా భారతదేశాన్ని "అల్లరిమూకల" చేతుల్లో పడకుండా "రక్షించడానికి" రాజీ అవసరమని భారత బూర్జువావర్గం, బ్రిటిష్ వలస ప్రభుత్వం రెండూ కూడా ఆదుర్దా చెందాయి.

**రాజీ-అధికార మార్పిడి**

ఆ విధంగా రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన వెంటనే అంతర్జాతీయ రంగంలో బలాబలాల్లో వచ్చిన మార్పులు, భారతదేశంలో ఊహించని విధంగా సాగుతున్న అన్ని తరగతుల ప్రజల విప్లవ వెల్లువ భారత బూర్జువా వర్గంతో రాజీబేరాలు కుదుర్చుకోవడానికి అప్పటికే బలహీనపడ్డ బ్రిటీష్ పాలకుల్ని తొందరపెట్టాయి. 1945 వేసవిలో రాజీ బేరాలు కుదుర్చుకోవడానికి గల అవకాశాలను పరిశీలించడానికి భారత పరిశ్రమల అగ్రాధిపతులైన జి.డి.బిర్లా, జె.ఆర్.డి. తాతాల నాయకత్వాన ఒక అధికార పారిశ్రామిక ప్రతినిధివర్గం ఇంగ్లండు, అమెరికాలు పర్యటించింది. కాంగ్రెసు నాయకురాలు జైలు నుండి విడుదల చేయబడి, సంఘటనలు అతివేగంగా జరిగిపోతున్న దశ అది. "భారత పారిశ్రామిక అభివృద్ధి పట్ల బ్రిటిష్ పరిశ్రమల వైఖరిలో ఖచ్చితమైన మార్పు వచ్చిందని, బ్రిటన్‌లోని బడా పారిశ్రామికాధిపతులు భారతదేశంలో పారిశ్రామికీకరణ అనివార్యతను అంగీకరించడమే కాక చాలా సందర్భాల్లో భారత రాజకీయ వాంఛలకు అనుగుణంగా ఉండటానికి అంగీకరిస్తున్నారని కనుగొనడం ద్వారా భారత-బ్రిటిష్ సహకారంతో నూతనాధ్యాయాన్ని ఆ పారిశ్రామిక ప్రతినిధి వర్గం ప్రారంభించిందని" ఈస్టరన్ ఎకనమిస్టు పత్రిక (1945 జూన్ 29) వ్రాసింది.

రాజీబేరాలకు ఇవ్వబడిన ఈ పచ్చ సిగ్నల్ సంఘటనలను మరింత వేగంగా ముందుకు నడిపింది. అధికారం మార్పిడి చేయాలని బ్రిటిష్ మంత్రివర్గం నిర్ణయించుకున్నది. మంత్రివర్గ ప్రతినిధివర్గం ఒకటి ఢిల్లీ చేరింది. ఆ వెంటనే కేంద్రంలో నెహ్రూనాయకత్వాన తాత్కాలిక ప్రభుత్వం ఏర్పర్చబడింది. 1947 ఆగష్టు 15 నాటికి అధికార మార్పిడి ప్రకటించబడింది. "స్వతంత్ర" భారతదేశానికి లార్డ్‌మౌంట్‌బాటన్ ప్రప్రథమ గవర్నరు జనరల్‌గా, జవహర్‌లాల్ నెహ్రూ ప్రప్రథమ ప్రధానమంత్రిగా 1935 నాటి భారత రాజ్యాంగం ప్రకారం భారత స్వాతంత్ర్యం ప్రకటించబడింది.

ఆ విధంగా స్వాతంత్ర్యం ప్రకటించబడింది. బ్రిటిష్ పతాకం అవనతం చేయబడింది. దాని స్థానంలో త్రివర్ణ పతాకం ఎగురవేయబడింది. కారల్ మార్క్స్ తన "లూయీబోనపార్టీ 18వ బ్రోమేయిర్" అనే రచనలో వర్ణించినట్లుగా "చిట్టచివరికి వధువును ఇంటికి తీసుకొని వచ్చారు. కానీ ఆమె అప్పటికే వ్యభిచారిణిగా మారిపోయింది. జాతీయ నాయకురాలు "రాజ్యాంగ కుతంత్రాల ద్వారా చరిత్ర గతిని మోసగించ జూశారు".

ఈ విధంగా స్వాతంత్ర్యయుద్ధం అనేది లేకుండానే, జాతీయ విమోచన సైన్యం అవసరం లేకుండానే, భారత స్వాతంత్ర్యం

శాంతియుతంగా, రాజ్యాంగ బద్ధంగా సాధించబడింది: ఫలితంగా 1947 ఆగష్టు 15న బ్రిటిష్ ప్రభుత్వం భారత దేశంలో తాను నెలకొల్పిన అన్ని వ్యవస్థలను, సంస్థలను, సర్వీసులను దత్తం చేస్తూ, నూతన భారత ప్రభుత్వానికి సుహృద్భావ వాతావరణంలో, క్రమబద్ధమైన పద్ధతిలో అధికారాన్ని మార్పిడి చేసింది.

''వలస యుగంలోని సామ్రాజ్యవాద విధానాలు, పోటీల చారిత్రక పరిణామాల ఫలితంగా రూపొందిన ప్రాదేశిక సమగ్రతకు భారతదేశం వారసురాలైంది. వలస పాలకులు చేసుకొన్న నీచమైన ఒడంబడికలను భారత ప్రజలు గుర్తించబోరు- అంటూ పొరుగు దేశాలకు హామీనిస్తూ 1921 లోనే అఖిల భారత కాంగ్రెసు కమిటి (ఏ.ఐ.సి.సి.) ఒక తీర్మానం చేసింది. సామ్రాజ్యవాద ప్రభుత్వం పొరుగుదేశాలతో చేసుకున్న ఒడంబడికలలో అత్యధికం భారతదేశాన్ని సామ్రాజ్యవాదం దోచుకోవడాన్ని కొనసాగించటానికి వీలుగా రూపొందించబడ్డాయని భారత ప్రజలు పరిగణిస్తారని ఆ తీర్మానం చాటింది. అందువల్ల సామ్రాజ్యవాదులతో ఎలాంటి ఒడంబడికలూ చేసుకోవద్దని భారత ప్రజల పట్ల ఎలాంటి విద్వేషమూ లేని, భారత ప్రయోజనాలకు నష్టం కల్గించాలన్న ఎలాంటి కోర్కె లేని ఆయా దేశాలని కోరింది.' (ఏషియన్ డ్రామా-పేజీ 181)

కానీ అధికార మార్పిడి జరగడంతో అధికారంలోకి వచ్చిన పాలకపార్టీ పై పవిత్ర తీర్మానానికి తిలోదకాలిచ్చింది. ప్రాదేశిక వారసత్వాల విషయంలోనూ, హిమాలయాలకు అనుకొని ఉన్న చిన్న రాజ్యాల విషయంలో బ్రిటిష్ వారు అమలు చేసిన బడుగు దేశాల విధానాల విషయంలోనూ యధాతథ స్థితినే కొనసాగించాలని కొత్తగా "స్వతంత్ర"మైన భారతదేశం నిర్ణయించింది. భూటాన్, సిక్కింలపై బ్రిటిష్‌వారు అనుసరించిన పెత్తదారీ విధానంలోని "విజ్ఞత"ను భారత ప్రభుత్వం ఎన్నడూ శంకించలేదు. దానితో సరిహద్దు దేశాలకి భారతదేశానికి మధ్య సంబంధాలు ఉద్రిక్తపూరితమయ్యాయి. పశ్చిమోత్తరం (వాయువ్యం), ఈశాన్య సరిహద్దుల విషయంలో భారత ప్రభుత్వపు మొండి వైఖరి, (1950, నవంబరు 20 నాడు భారత పార్లమెంటులో నెహ్రూ అన్నట్లు) "మ్యాపులుండనీ లేకపోనీ" సామ్రాజ్యవాద వారసత్వంగా సంక్రమించిన సరిహద్దులనే కొనసాగించాలన్న మొండిపట్టు, ప్రభుత్వం అనుసరించిన "ముందుకు చొచ్చుకుపోయే విధానం"- వీటి ఫలితాలు అందరికీ బాగా తెల్సినవే. వాటినిక్కడ మళ్ళీ చెప్పనవసరం లేదు. అధికార మార్పిడితో పాటుగా భారత ప్రభుత్వం భారత ప్రయోజనాలకు హానికరమైన సామ్రాజ్యవాద విధానాలనే తన విధానాలుగా పుణికి పుచ్చుకున్నదనీ అనుభవం చాటి చెప్పింది.

భారత ప్రభుత్వం మిలటరీ వ్యవస్థను బ్రిటిష్‌వారి నుంచి వారసత్వంగా పొందింది. భారతసైన్యం ఆనాడు సామ్రాజ్యవాద సైన్యాల్లో అంతర్భాగంగా ఉండేది.

''బిటిష్ ఇండియా సైన్యం రాజకీయాలకు దూరంగా ఉంచబడింది. ప్రాథమికంగా సామ్రాజ్యవాద నిర్వహణకది నిర్మించబడింది...ఆఫీసర్లు పూర్తి విశ్వాసపాత్రులా కాదా అని జాగ్రత్తగా పరీక్షించి చూచేవారు...వారిలో కొందరు బ్రిటిష్ పాలనలో లాభపడ్డవాళ్ళే. బ్రిటిష్ పాలన కొనసాగించడంలో వారి స్వప్రయోజనాలు ఇమిడి ఉండేవి. ఆఫీసర్లలో అత్యధికులు పాశ్చాత్య భావాలు, సంస్కృతి, వేషం, సాధింక అలవాట్లు వంటబట్టించుకొన్నారు" (బ్రిగేడియర్ జె.పి. దాల్వీ- "హిమాలయన్ బ్లండర్"-పేజి345) వలస పాలకులకి కీలకాంశమైన శాంతిభద్రతల పరిరక్షణలో కూడా వారికి బాధ్యత ఉండేది.

ఆ విధంగా భారత సైన్యం భారత ప్రజల ప్రధాన జీవితం నుండి పూర్తిగా విడగొట్టబడి, జాతీయ లక్ష్యాలతో ఏ మాత్ర నిమిత్తం లేకుండా, ఉద్దేశపూర్వకంగా రాజకీయ వాతావరణం నుండి దూరంగా ఉంచబడి సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు తోడ్పడే కిరాయి సైన్యంగా మాత్రమే అభివృద్ధి చేయబడింది. బ్రిటిష్‌వారి నుండి భారత ప్రభుత్వం వారసత్వంగా పొందిన సైన్యం అలాంటిది. ఈ జాతీయ వ్యతిరేక వారసత్వంతో పాటు, భారతసైన్యం 1947 ఆగష్టు 15 తర్వాత కూడా రెండు సంత్సరాల పాటు బ్రిటిష్ సర్వసేనాని అయిన జనరల్ బోచర్ ఆధిపత్యం క్రిందనే ఉంది. రక్షణ సర్వీసులు విద్య సైతం వారి చేతుల్లోనే ఉండిపోయింది. వెల్లింగ్టన్ వద్ద గల రక్షణ సర్వీసుల స్టాఫ్ కాలేజి కూడా వారి అధీనంలోనే ఉంది. 1950 అక్టోబరులో "టిబెట్‌లోకి చైనా ప్రవేశించిందన్న వార్త వెలువడగానే" అప్పటి "కమాండర్ జనరల్ డబ్ల్యు. డి.ఏలాంట్సేన్ ప్రధాన తరగతి గదిలోకి దూసుకొనిపోయి అక్కడ ఉపన్యాసమిస్తున్న లెక్చరర్‌ను ఆపి చైనీయుల చర్య పట్ల భారత నాయకుల్లో దూరదృష్టి లేకపోవడాన్ని కార్యశూన్యతను ఖండించాడని" బ్రిగేడియర్ జె.పి. దాల్వీ వ్రాశాడు. (హిమాలయన్ బ్లండర్-పేజి28)

ఆ విధంగా అధికార మార్పిడి, భారత బూర్జువా వర్గం, సామ్రాజ్యవాదులు కలిసి దోపిడి చేయడానికి వీలుగా భారతదేశాన్ని పదిలపరచుకోవడం కోసం చేసుకొన్న అవమానకరమైన రాజీ ఒప్పందం మాత్రమే. ❋

( మిగతాది వచ్చే సంచికలో)

# నిరుద్యోగం పోవాలంటే ఈ వ్యవస్థే మారాలి!

- రిసెర్చి యూనిట్ ఫర్ పొలిటికల్ ఎకానమీ

నిరుద్యోగం కేవలం మానవ సంబంధిత సమస్యే కాదు. ఉపాధి కరువైన అభాగ్యులు మనుగడ కోసం నిత్యం ఎదుర్కొంటున్న జీవన్మరణ వేదన. వాస్తవానికి ఈ నిరుద్యోగం-అందుబాటులోనున్న వనరుల సద్వినియోగం చేసుకోలేని వ్యవస్థీకృత సామాజిక విధానలోపమే. ఉత్పత్తి కారకాలైన భూమి, పెట్టుబడుల మాదిరిగా మానవశ్రమ ప్రేక్షక పాత్రనైతే వహించదు. అత్యధిక ఉత్పత్తిని సాధించాలంటే ఈ ఉత్పత్తి కారకాలను పరిపూర్ణంగా సద్వినియోగం చేసుకోగలగాలి.

1929 నాటి 'గ్రేట్ డిప్రెషన్' వరకూ పెట్టుబడిదారీ ఆర్థికవేత్తలకు ఈ నిరుద్యోగ సమస్య స్ఫురించనేలేదు. వారి విధాన, ఆలోచనల మేరకు మార్కెట్‌లో సరుకు అధిక సరఫరా, వస్తు విలువ తగ్గనంత వరకూ అదుపులో వుండాలి, మార్కెట్‌లో వస్తు నిల్వలు తగ్గితే అనివార్యంగా ధరలు పెరుగుతాయి. ఈ తరహాలోనే నిరుద్యోగం నెలకొనడానికి వీరన్వయించిన కారణం, కార్మిక సంఘాల బేరసారాలతో వేతనాలు తగ్గకపోవడమేనట. వేతనాలు తగ్గితే పెట్టుబడిదారులు ఎంచగ్గా ఎక్కువమంది కార్మికులను వినియోగించి అత్యధిక ఉత్పత్తులను సాధించేయగలరట. అప్పుడిక నిరుద్యోగ సమస్య లేవనెత్త సమస్యే లేదట.

కానీ 1929 నాటి మాంద్యం. పెట్టుబడిదారీ ఆలోచనా విధానానికే గండి కొట్టింది. పెట్టుబడులు అంతరించిపోయాయి, ఉత్పత్తి కుదించబడింది, కార్మికులు తొలగించబడ్డారు. తగ్గింపు వేతనాలకు సైతం కార్మికులను వినియోగించుకోలేని పరిస్థితులు నెలకొన్నాయి.

జె.ఎమ్.కీన్స్ అవగాహన మేరకు నిరుద్యోగం అతి కీలక సమస్య. పెట్టుబడిదారీ ఆలోచనావరిధిలోనే ఆయన ఆలోచించినప్పటికి కీన్స్ ప్రకారం పెట్టుబడిదారులు వారు ఆశించిన ప్రయోజనాల మేరకు కార్మికులను వినియోగిస్తారు. ఇది ఒక కార్మికుల విషయంలోనే కాదు. పెట్టుబడి భూ వినియోగాల్లో సైతం ఇదే ధోరణి. ఆశించిన ప్రయోజనాలు లేవనుకొంటే వాటిని నిరుపయోగంగా వుంచేందుకయినా సంసిద్ధులవుతారు. ఈ పరిస్థితుల్లో ఉపాధికల్పనకనువుగా రాజ్యం(ప్రభుత్వం)పెట్టుబడులను కేటాయించాల్సివుంది. కీన్స్ నిర్దిష్ట ఆలోచనావిధానం పెట్టుబడిదారీ విధాన మనుగడ నిలకడలకనువుగా వున్నప్పటికి ఇదే శాశ్వతం. ఈ విధానమే నిరుద్యోగాన్ని పరిష్కరించేస్తుంది అని కూడా చెప్పడం లేదన్నది గమనించదగ్గది.

ప్రస్తుత పరిస్థితులను సమీక్షిస్తే గత మూడు దశాబ్దాలుగా కీన్స్‌కు పూర్వపు ఆలోచనా విధానాలు మన పాలకవర్గ మేధావుల మెదళ్ళలోకి వచ్చి పడ్డాయి. పాలకుల్లో ఈ ఆలోచనలు విశ్వవ్యాప్తంగా విస్తరించాయి. ఈ విస్తరణ పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలలోనే కాకుండా నిత్యం నిరుద్యోగ సమస్యలతో సతమతమయ్యే మన భారతదేశం వంటి మూడో ప్రపంచదేశాలకూ ప్రాకింది. ఈ పరిస్థితుల్లో సాంఘిక రక్షణ కార్మిక భద్రతలకు తిలోదకాలిచ్చి మనగడకు కనీస పరంగా అవసరమయ్యే స్థాయికి లోబడే మానవ శ్రమ 'విలువ ' దిగజార్చబడింది.

నూతన ఆర్థిక విధానాల ఆగమనం ఈ విధాన అమలును త్వరిత పర్చింది. ప్రధానంగా సంఘటిత కార్మిక శక్తిపై ఎక్కు పెట్టబడింది. అది ఆచరణలో కాంట్రాక్టు కార్మికులను శాశ్వత ఉద్యోగాల్లో వినియోగించే విషయంలో గాని, పరిశ్రమలనుండి కార్మికులను తొలగించడం లేదా పరిశ్రమను పూర్తిగా మూసివేయడంలో గాని నియంత్రణే దిశగా మళ్ళింది. పరిమిత వేతనాలతో కాంట్రాక్టు కార్మికులను శాశ్వత కార్మికుల స్థానాల్లో నియమించేయగలుగుతున్నారు. తద్వారా వస్తు ఉత్పత్తి విలువలో శాశ్వత కార్మిక వేతన వాటాను తగ్గించుకో గలుగుతున్నారు. కాంట్రాక్టు కార్మికుల వాటాను పెంచుకుంటున్నారు. భారత ఆర్థిక విధాన నియంత్రణా కేంద్రం(సెంటర్ ఫర్ మానిటరింగ్ ఇండియన్ ఎకానమీ) డిసెంబర్ 2003 నాటి అధ్యయనం ఈ విషయాన్నే వక్కాణించింది. 1991-92 నాటికి మన కంపెనీల్లో కార్మికుల వేతన వాటా, మొత్తం ఉత్పత్తి ఖర్చు వాటాలో 6.1 శాతం వుండగా, 2002-03 నాటికి అది 4.4 శాతానికి కుదించబడింది.

అధికార ఉపాధి కల్పనా గణాంకాలను చర్చించే ముందు కొన్ని సామాజిక విషయాలను పరిగణనలోకి తీసుకోవలసి వుంటుంది. ఒక వ్యక్తి స్వయంపోషకంగా వున్నాడు అంటే ఏంపనిచేసి మనుగడను సాగిస్తున్నాడన్నది గమనించాలి. ఇంటి పనులు చేసుకుంటూనా? నేర ప్రవృత్తికి పాల్పడుతున్నాడా (ఇదోరకం స్వయంపోషకం) తదితర అంశాలను పరిగణించాల్సి వుంది. అంతటితో ఆగిపోకుండా, ప్రాయోజిత విధానాల ద్వారానే ఆ వ్యక్తి స్వయం సంపాదన సాధిస్తున్నాడనుకొంటే, ఆ సంపాదన ఆయన కుటుంబ కనీస అవసరాలకు సరిపడేలా వుందా? లేదా? అన్నది సైతం పరిగణనలోకి తీసుకోవాలి. ఓ బీడి కార్మికుడు/కార్మిక మహిళ రోజంతా బీడీలు చుట్టినా పాతిక రూపాయలకు మించని సంపాదన వారి కనీస అవసరాలకు ఏ మూలకి? ప్రభుత్వ చిట్టాల్లో ఆయన లేదా ఆమె ఉపాధి పొందిన కార్మికుడే. ఫలితం ఏమిటి? నేడు ఆత్మహత్యల పరంపరకు బలౌతున్న చిన్న సన్న కారు రైతాంగానిదీ ఇదే వ్యథ. ఆరుగాలం కష్టం కడుపును నింపక పోవడంతో, అనివార్యమైన అప్పులు తీర్చే మార్గం లేకనే ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. వీరంతా పదిమందికి అన్నం పెట్టే రైతన్నలే.

ఉద్యోగం అంటే 'బతికేందుకు అవసరమైన ఉపాధి'. అంటే ఉద్యోగం వుంటే అతను పేదవారి లెక్కల్లోకి రాడు. ఆపాటి ఉపాధే కల్పించకపోతే, అది ఉద్యోగమే కాదు. 1999-2000 నాటికి దేశంలో పేదలు 26 శాతమందేనని ప్రణాళికాసంఘం అంటుంది. 26 మందేనా అనే మీ అనుమానాన్ని ఒకసారి అలా పక్కన పెడితే, అంటే అంతమందికి ఉద్యోగం లేదన్నమాటే కదా. కాని ఆ సంవత్సరంలో 7.3 శాతంమంది మాత్రమే నిరుద్యోగులున్నారని ప్రణాళికాసంఘం అంటూంది. ఇది విడ్డూరమైన పరిస్థితి. ఎందుచేతనంటే ప్రభుత్వ లెక్కల ప్రకారమే ఉద్యోగం వున్నా, వాడు పేదవాడు కాడు. ప్రభుత్వ గణాంకాలతో ఎలా ఆటలాడుకొంటుందో తెలుసుకోవటానికి ఇదో ఉదాహరణ.

భారతదేశం వంటి మూడో ప్రపంచదేశాల్లో వేతనం తక్కువ ఎక్కువలతో పని లేకుండా వేరే ప్రత్యామ్నాయంలేక దొరికిన మేరకు పని చేస్తున్నారు. నిరుద్యోగ భృతి వంటివి అమలులో లేవు కదా మరి. ఉపాధి పొందిన వారిలో కేవలం 8 శాతం మందే సంఘటిత రంగ కార్మికులు. మిగతా వారంతా అసంఘటిత రంగానికి చెందిన వారే. వీరికి కనీస వేతన చట్టాల వంటివి అమలు కావు. ఈ తరహా విధానాలతో వున్న మన భారతదేశ ఉపాధి అంచనాలు, ఇతర పారిశ్రామికాభివృద్ధి చెందిన దేశాల్లోని అంచనాలతో సారూప్యానికైనా పనికి రావు.

**త్వరితగతిన కుదింపబడుతున్న ఉపాధి కల్పన:**

1991 నాటి నుండి సంఘటిత రంగంలో ఉపాధి కల్పన అడుగంటుతూందన్న విషయం తెలిసిందే. తొంభైయవ మొత్తం దశకంలో ఉపాధి కల్పనా శాతం 4కి లోబడే వుంది. 1997 నుండి 2001 మధ్యకాలంలో అయితే సంవత్సర సంవత్సరానికీ పడిపోతూ వస్తునే వుంది.

ప్రణాళికా సంఘానికి చెందిన ఎస్.పి. గుప్తాగారి అధ్యయనం ప్రకారం ఒక్క 2003 లోనే కార్పోరేట్ రంగం పదిలక్షల మందికి ఉద్వాసన పలికింది.

## సంఘటితరంగ వార్షిక అభివృద్ధి సూచి:

పట్టిక-1

| | మిలియన్లలో | | మిలియన్లలో |
|---|---|---|---|
| 1981-82 | 0.93 | 1991-92 | 0.32 |
| 1982-83 | 0.33 | 1992-93 | 0.12 |
| 1983-84 | 0.44 | 1993-94 | 0.20 |
| 1984-85 | 0.43 | 1994-95 | 0.15 |
| 1985-86 | 0.04 | 1995-96 | 0.41 |
| 1986-87 | 0.58 | 1996-97 | 0.31 |
| 1987-88 | 0.08 | 1997-98 | 0.08 |
| 1988-89 | 0.25 | 1998-99 | 0.06 |
| 1989-90 | 0.39 | 1999-00 | 0.15 |
| 1990-91 | 0.39 | 2000-01 | 0.17 |

మొత్తం ఉద్యోగాల్లో సంఘటిత రంగ ఉద్యోగాలు చాలా తక్కువ. 1983, 1993-94, 1999-2000 నాటి జాతీయ నమూనా సర్వేల ప్రకారం నిరుద్యోగ రేటు 8.3 శాతంగా 1983 లోనే నమోదైయింది. 1993-94 నాటికి 6 శాతానికి తగ్గి 1999-2000 నాటికి 7.3 శాతానికి పెరిగింది. పైన ఉదహరించిన మొదటి కాలంలో కొత్తగా లభ్యమైన ఉద్యోగాలు 76 లక్షలైతే, రెండవ కాలంలో 35 లక్షలకే తగ్గిపోయాయి.

పట్టిక-1

ఉద్యోగులు-నిరుద్యోగులు

| | మిలియన్లలో | | | వార్షికాభివృద్ధిరేటు | |
|---|---|---|---|---|---|
| | 1983 | 1993-94 | 1999-2000 | 1983 నుండి 1993-94 | 1993-94 నుండి 1999-2000 |
| జనాభా | 718.2 | 894.0 | 1004.0 | 2.00 | 1.95 |
| శ్రామికవర్గం | 261.3 | 336.0 | 363.3 | 2.43 | 1.31 |
| పని అర్హత కలవారు | 239.6 | 315.8 | 336.8 | 2.70 | 1.07 |
| నిరుద్యోగ శాతం | 8.3 | 5.99 | 7.32 | | |
| నిరుద్యోగుల సంఖ్య | 21.8 | 20.1 | 26.36 | -0.08 | 4.74 |

(ప్లానింగ్ కమీషన్ ఎకనామిక్ సర్వే 2002-03 ప్రకారం)

పై విశ్లేషణల ద్వారా మనకవగతమౌతుందేమంటే, ఆర్థిక సంస్కరణల అమలు పూపందుకున్న నాటినుండే నిరుద్యోగ సమస్య తీవ్రతరమయ్యింది. ఉద్యోగాల పెరుగుదలరేటు తీవ్రంగా పడిపోయింది. 1983 నుంచి 93-94 మధ్యకాలంలో 2.7 శాతం నుంచి 93-94 నుంచి 99-00 మధ్య 1.1 శాతానికి పడిపోయింది.

**నిరాటంకంగా పెరుగుతున్న నిరుత్సాహ-నిరుద్యోగాలు**

ఈ విషయ పరిశీలనలోకి పోయే ముందు కొన్ని నిర్వచనాలను పరిశీలిద్దాం. శ్రమ శక్తి (లేబర్ ఫోర్స్) అంటే పనిచేస్తున్న, పనికోసం (ఆత్రంగా) ఎదురుచూస్తున్న కార్మికులు

శ్రామిక శక్తి (వర్క్ ఫోర్స్) అంటే ఇదివరకే పలు కార్ఖానాల్లో పనికి కుదిరిన కార్మికులు. నిరుద్యోగులు అంటే శ్రమశక్తికి- శ్రామిక శక్తి మధ్య తేడా. నిరుద్యోగ రేటు అంటే శ్రమశక్తిలో నిరుద్యోగ శాతం.

ఉదహరణకి మనకు అందుబాటులో వున్న శ్రమశక్తి 100 అనుకుంటే, వినియోగిస్తున్న శ్రామికశక్తి 80 అయితే నిరుద్యోగులు ఎంతమంది అంటే, శ్రమశక్తి-శ్రామికశక్తి=100-80=20 నిరుద్యోగుల రేటు 20 శాతం. కాని ఉద్యోగాల సంఖ్య పెరగకుండానే, శ్రామికశక్తిని 90 గా చూపితే, నిరుద్యోగులు కేవలం 10 మందిగా చూపే తిరకాసు లెక్క ఒకటుంది. ఈ తరహాదే ఇలాంటి తిరకాసు లెక్కలు చూపించే ఉపాధి వెతుకులాటకు గతంలో సంవత్సరానికి 7.5 మిలియన్ల మంది రాగా, ఆ తరువాత కాలంలో 4.6 మిలియన్లుగా చూపి తప్పుదారి పట్టించే యత్నం చేశారు.

నిజానికి పనికోసం ఎదురు చూసే కార్మికుల సంఖ్య తగ్గడానికి మరో కారణం, ఉద్యోగ అవకాశాలు సన్నగిల్లి, వయసు పైబడి నిరుత్సాహానికి లోనయి ఆ ప్రయత్నాల నుండి విరమించుకున్న నిరుత్సాహ నిరుద్యోగులే.

ప్రణాళికాసంఘం సైతం ఇటీవల కాలంలో ఉపాధి కల్పన విస్తరణ, పెరుగుదల అవకాశాలను గణించింది. ఉపాధి కల్పన, స్థూల ఉత్పాదకత (జిడిపి) కి అనులోమానుపాతం లో వుంటుంది. ఒక పాయింట్ జిడిజి లో పెరుగుదల వుంటే ఉపాధి కల్పనా అవకాశాల్లో సైతం ఒక పాయింట్ మేరకు పెరుగుదల వుండాలి. తద్వారా జిడిపి పెరుగుదలకు అనుగుణంగా ఉపాధికల్పన జరుగుతుందో లేదో అవగతమౌతుంది.

మొదటిదశగా 1983-93 కాలాన్ని పరిగణనలోకి తీసుకుంటే ఉపాధికల్పనా విస్తరణ (ELASTICITY) 0.52 అంటే జిడిపి వార్షిక పెరుగుదల 5.2 శాతం కాగా ఉపాధికల్పన ఇందులో సగం మేరకే నమోదయింది. అదే రెండో దశ కాలంలో 1993-94 నుండి 1999-2000 ను తీసుకుంటే ఉపాధికల్పనా విస్తరణ 0.16 కాగా జిడిపి పెరుగుదల సంవత్సరానికి 6.7 శాతంగా నమోదయింది. ఉపాధికల్పనా విస్తరణ, జిడిపి విస్తరణలో ఒకింట ఆరోవంతు మేరకు కుదించుకు పోయింది.

ప్రస్తుతం ప్రణాళికాసంఘం అంచనాల మేరకు శ్రమశక్తి 1.31 శాతం మేరకు ప్రతీ సంవత్సరం పెరుగుతూ వుంది. కాగా ప్రణాళికాసంఘం ఆశిస్తున్న జిడిపి వార్షిక పెరుగుదల 8.2 శాతం, ఈ మేరకు ఉపాధికల్పనా అవకాశాలను మెరుగుపర్చగలుగుతుందా? ఇందువల్లనే ఏమో రానున్న కాలంలో జిడిపి వార్షిక పెరుగుదల 8 శాతం మేరకే నని పాలకవర్గాలు ఘోషించడం.

గత కొద్ది సంవత్సరాలుగా ఈ మేరకు జిడిపి పెరుగుదల సాధ్యమౌతుందా? అంటే లేదనేది అక్షరసత్యం. 1988-89 నుండి ఇంత పెరుగుదల ఎపుడూ లేనేలేదు. గత సంవత్సరంలో అయితే తీవ్ర కరువు పరిస్థితులు నెలకొన్నందున అతి స్వల్పంగా పెరుగుదల నమోదయింది. 90వ దశకంలోని 1994-95, 1995-96 సంవత్సరాలలో నూతనంగా నమోదైన నిరుద్యోగులకు అవకాశం కల్పించే స్థాయిలో జిడిపి పెరుగుదల సాధ్యమయింది. ఆ తరువాత కాలంలో పూర్తిగా ఉపాధికల్పన స్తంభించిన వాస్తవం మనముందు వుంది (పట్టిక 4). 1992-93 నుండి 2002-03 వరకు సగటు జిడిపి పెరుగుదల రేటు 5.9 శాతం కాగా, గడిచిన ఆరేళ్ళ కాలంలో ఈ పెరుగుదల రేటు 5.3 శాతం మాత్రమే.

**పట్టిక-3**

**ఉపాధికల్పన, ఉపాధికల్పన వార్షిక పెరుగుదల, ఉపాధికల్పన విస్తరణ**

| ఉపాధికల్పన (మిలియన్లలో) | ఉపాధికల్పన పెరుగుదల | నిరుద్యోగం రేటు | | ఉపాధికల్పన విస్తరణ | జిడిపిపెరుగుదల వార్షికశాతం |
|---|---|---|---|---|---|
| 1999-2000 | 1993-94 1999-2000 | 1999-2000 | 1993-1994 | 1993-94 1999-2000 | 1993-94 1999-2000 |
| 336.73 | 1.07 | 7.32 | 5.99 | 0.16 | 6.7 |

(ప్రణాళికా సంఘం ఎకనామిక్ సర్వే 2002-03)

**పట్టిక-4**

| సంవత్సరం | జిడిపి పెరుగుదల రేటు | మూడేళ్ళ నగటు | సంవత్సరం | జిడిపి పెరుగుదల రేటు | మూడేళ్ళ నగటు |
|---|---|---|---|---|---|
| 1991-92 | 1.3 | | 1997-98 | 4.8 | 6.6 |
| 1992-93 | 5.1 | | 1998-99 | 6.5 | 6.4 |
| 1993-94 | 5.9 | 4.1 | 1999-00 | 6.1 | 5.8 |
| 1994-95 | 7.3 | 6.1 | 2000-01 | 4.4 | 5.7 |
| 1995-96 | 7.3 | 6.8 | 2001-02 | 5.6 | 5.4 |
| 1996-97 | 7.8 | 7.5 | 2002-03 | 4.3 | 4.8 |

ప్రస్తుత వార్షిక సంవత్సర (2003-04) జిడిపి పెరుగుదల 8 శాతంగా ఊహాగానాలు వెలువడుతున్నాయి. గడచినకాలంలోని బాక్‌లాగ్ నిరుద్యోగులను మినహాయించైనా, నూతనంగా నమోదైన వారికైనా ఉద్యోగ అవకాశాలు వుంటాయా?

ప్రభుత్వ గణాంకాల మేరకే 2003-04 నాటికి 3.4 కోట్ల నిరుద్యోగులు నమోదైన వైనం మనముందు వుంది. నిరుద్యోగ పెరుగుదల శాతం 7.3 నుండి 8.8 కు పెరిగింది. బ్యాక్‌లాగ్ ఏటా పెరుగుతున్న నిరుద్యోగ శాతానికి జోడవుతూనే వుంది. గత పెరుగుదల శాతం 2.43 మేరకు శ్రమశక్తి ఏటా పెరుగుతూ వుంటే భవిష్యత్‌ను వూహించడానికే భయం వేస్తుంది. 2003-04 చివరినాటికి శ్రమశక్తి 42.7 కోట్లకు విస్తరించగా, ఉపాధికల్పన 34.9 కోట్లకే పరిమిత మవుతుందని ఓ అంచనా. ఈ మేరకే 7.8 కోట్ల మంది నిరుద్యోగులుగా మిగిలిపోతున్నారు. గడచిన నాలుగేళ్ళలోనే నిరుద్యోగం పెరుగుదల రేటు 13.2 శాతం నుండి 18.3 శాతానికి పెరిగింది. ఇక రానున్న కాలంలో ఏటా శ్రమశక్తి జాబితాలోకి చేరనున్న నూతన సభ్యులకు అవకాశాలు కల్పించాలంటే, జిడిపి పెరుగుదల సంవత్సరానికి 15.2 శాతంగా వుండాలి. సాధ్యమయ్యే పనేనా ఇది?

**సగంమందికి లభించని ఉపాధి**

ఇన్ని రకాల లెక్కలున్నప్పటికీ రెండు ముఖ్యమైన విషయాలు మరచిపోకూడదు. మొదటిది శ్రమశక్తి అనే అధికారిక నిర్వచనం. ఉద్యోగం దొరికితే పని చేయగల అనేకమంది ప్రజలను వదలివేస్తుంది. శ్రమించగల వయోజనుల సంఖ్య అధికారిక నిర్వచనం ప్రకారం శ్రామికశక్తి కన్నా చాలా ఎక్కువ. ఉదాహరణకు 2000లో ఉద్యోగుల సంఖ్య 33.70 కోట్లు కాగా, అధికారిక శ్రామిక జనాభా సంఖ్య 36.30 కోట్లు. కాని వయోజన జనాభా 66.20 కోట్లు పెరిగింది. అంటే 31.30 కో. మంది పని చేయగా సామర్థ్యమున్న వారిలో దాదాపు సగం ఎటువంటి అర్థవంతమైన ఉపాధి లేకుండానే ఉన్నారన్న మాట.

అత్యధిక శాతం మహిళలు ఇళ్లల్లో పనులు చేసుకుంటూ నెట్టుకొస్తున్న వారే వీరిలో ఎక్కువ మంది. ఈ శ్రమ ఉపాధిగా గుర్తించలేనిది, కాగా వ్యవసాయరంగంలో గాని, పారిశ్రామిక రంగాల్లో

కాని, ఉపాధిని పొందిన మహిళలు మాత్రం ఈ ఇంటిశ్రమ నుండి మినహాయింపును పొందలేక పోతున్నారన్నది మరో నిజం.

ప్రధానంగా మహిళా ఉపాధి గృహ సంబంధిత కుటీర పరిశ్రమలకే పరిమితం అవుతూంది. బీడీల తయారీ, అప్పడాల తయారీ, పచ్చళ్ళ తయారీ, మందుగుండు సామ్మాగ్రి తయారీ, అగ్గిపెట్టెలు, మందుల ప్యాకింగులు వంటి శ్రమలకే మహిళలు అధికంగా పరిమితం అవుతున్నారు. ఇక్కడ కూడా ప్రధానం అడ్డంకి లేదా లోపం ఏమంటే ఈ గృహ సంబంధిత రంగాల్లో సైతం మహిళలకు అవకాశాలు కుదించుకుపోవడమే. ఈ అవకాశాలు కుదించుకుపోయే సమస్య ఒక్క మహిళలకే పరిమితం కాలేదు. సుమారు 10 కోట్ల మేరకు పురుషులు సైతం ఏ విధమైన పనీ-పాటు లేకుండా నిరర్ధకంగా వున్నారు.

ప్రధానంగా మరో విషయాన్ని మనం గుర్తెరగాల్సి వుంది. శ్రమశక్తి జాబితాలోకి ఏటా 1.8 కోట్ల మంది నమోదవుతూ వుంటే, ఏటా ఉపాధిని పొందుతున్న, పొందగలుగుతున్న వారు 40 లక్షల లోపే..

ఇక రెండో విషయాని కొస్తే.., ఉపాధి పొందిన వారిగా చెప్పుకొస్తున్న వారిలో అత్యధికులు అరా-కొరా వేతనాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నా వారే. (చంద్రబాబు మార్క్ ఉపాధి) ఇంకా ముందుకు పోతే స్వయం ఉపాధి పేరిట, సన్నకారు రైతాంగం, చిన్న వ్యాపారులు వంటి వారి శాతమే ఎక్కువ. అయితే ఏంటంటే మరో ప్రత్యామ్నాయం లేక బతుకు బండిని లాగే ప్రయత్నం మాత్రమే వీరిది. అంచనాలకు అతీతమైంది వీరి శాతం. వీరంతా అసంఘటిత రంగానికి చెందిన వారే. గతంలో చెప్పుకున్నట్టు సంఘటిత రంగ కార్మికులు 8 శాతం మాత్రమే కదా!

నిరుద్యోగ గణాంక వివరాలు ఈ విధంగా వున్నాయి. ఈ నేపథ్యంలో నూతన ఆర్థిక విధానాలు ఈ సమస్యను మరింతగా తీవ్రతరం చేసేందుకే దోహద పడుతున్నాయి.

ఉపాధికల్పనా అవకాశాలు విస్తరించే అవకాశాలు కుదించుకుపోయి, ఉద్యోగ భద్రతే కరువయ్యింది. సరాసరి వేతనాలు తగ్గిపోయాయి. ఉపాధికల్పనకు అనువైన సేవారంగాల్లో సైతం అవకాశాలు సన్నగిల్లాయి.

**వ్యవసాయరంగ సంక్షోభం-సన్నగిల్లిన ఉపాధి:**

నిరుద్యోగసమస్యే తీవ్రం కావటానికి వ్యవసాయరంగంలో ఉపాధికల్పన నున్నాస్థాయికి దిగజారడమే కారణం. ప్రస్తుత పరిస్థితులకు అన్వయించుకుంటే, సంవత్సరానికి 0.02 శాతం చొప్పున దిగజారుతూ వుంది. 1993-94 సంవత్సరం నాటికి మొత్తం ఉపాధిలో ఈ రంగంలో ఉపాధికల్పన 60.4 శాతం కాగా, 1999-2000 నాటికి 56.7 శాతానికి తగ్గిపోయింది. భవిష్యత్ సైతం ఆశాజనకంగా లేదు.

పాలకవర్గాలు చేపడుతున్న ఆర్థిక విధానాలు-ఆధునిక సేద్య విధానాల కారణంగానే ఈ పరిస్థితి దాపురించింది. ప్రభుత్వరంగ సంక్షేమ పెట్టుబడుల కోత, బ్యాంకు రుణాల కుదింపుల ఫలితంగా ఉత్పత్తి వ్యయం తడిపి మోపెడవుతుంది. తగ్గింపు ధరలతో దిగుమతులు స్వదేశీ సేద్యానికి పోటీగా నిలుస్తుంది. గిట్టుబాటు ధరల మద్దతు సుమారుగా లేకపోవడంతో క్రమేణా సన్నకారు చిన్నకారు రైతులు తమ భూములను కోల్పోవలసి వస్తుంది. గ్రామీణుల్లో *1987-88* నుండి *1999-2000* నాటికి భూవసతులను కోల్పోయిన నిర్వాశితుల శాతం 35 నుండి 41 కి పెరగటం గమనించదగ్గది.

ఇది వరకు చిన్నకారు రైతాంగానికి ఉన్న స్వల్ప భూవసతిలో కుటుంబం యావత్తు ఉపాధిని పొందగలిగే వారు. ఉన్న భూవసతి హరించుకు పోవడంతో మొత్తం కుటుంబం రోడ్డున పడే పరిస్థితి. మధ్య తరగతి రైతాంగం వారు కల్పించగలిగే ఉపాధిని కల్పించలేని వారి శాతం ఇదే కాలంలో 19 నుండి 22 కు పెరిగింది. ఈ తరహా ఉపాధి కోల్పోయిన వారి శాతం మొత్తం రైతాంగంలో 55 శాతం నుండి 63 శాతం మేరకు పెరిగిందని ఓ అంచనా. (1987-88 నుండి 1999-2000 నాటికి)

వ్యవసాయక ఉత్పత్తి పెరుగుతున్న జనాభాకు అనువుగా పెరగని కారణంగా సమస్య మరింత జటిలమౌతుంది. ఈ సమస్యల నేపథ్యంలో పీడిత రైతాంగం భూస్వాములు, అప్పులనిచ్చే వడ్డీ వ్యాపారుల ముందు సాగిల పడాల్సిన దుస్థితి, ఈ నిస్సహాయతను భూస్వాములు వినియోగించుకుని ఈ పేదరైతాంగపు భూములను ఆక్రమించేయడం జరుగుతుంది. ఇక పాలకవర్గాలు గ్రామీణ మౌలిక వసతుల కల్పన. సంక్షేమ పథకాల నుండి తప్పుకోవడంతో వ్యవసాయేతర ఉపాధి సైతం సన్నగిల్లుతుంది. 1970-80 వ దశకంతో పోల్చి చూస్తే ఈ వ్యవసాయేతర ఉపాధి కల్పన సగానికి సగం మేరకు కుదించబడింది.

**నిస్సహాయ స్థితిలో 'పారిశ్రామిక ఉపాధి':**

అయితే మరి, వ్యవసాయరంగంలో ఉపాధికోల్పోయిన వారందరికీ, పారిశ్రామికరంగం ఉపాధి కల్పించగలుగుతుందా? అంటే లేదన్నదే సమాధానం. 1993-2000 మధ్య కాలంలో వ్యవసాయ రంగం సుమారు 2.7 కోట్లమందికి ఉపాధి కల్పించగలిగితే, నేడు పూర్తిగా స్థంభించింది. మరి ఇదే కాలంలో పారిశ్రామికరంగం ఉపాధికల్పన పెరిగినా ఆ స్థాయిలో పెరగలేదు. కేవలం 92 లక్షల మేరకే ఉపాధికల్పన పెరిగింది. అంటే వ్యవసాయరంగ ఉపాధికల్పనలో ఒకింట మూడోవంతన్న మాట.

1993-94 నుండి 1999-2000 సంవత్సరాల మధ్య కాలంలో వస్తు ఉత్పత్తి రంగంలో 58 లక్షల ఉద్యోగాలు కల్పించబడితే, ప్రభుత్వ రంగ సంస్థల్లో మాత్రం 2 లక్షల మందికే ఉపాధిలభ్యమైంది. పారిశ్రామిక ఉపాధి సైతం కార్ఖానాల్లో లభ్యం కావడంలేదు. అఖిలభారత పారిశ్రామిక పరిశీలన మేరకు పారిశ్రామిక ఉపాధి కల్పన 1993-2000 మధ్య కాలంలో 87 లక్షల నుండి 80 లక్షలకు తగ్గిపోయింది. తద్వారా వస్తు ఉత్పత్తి రంగంలో లభించిన ఉపాధి కార్ఖానాల బైటేనన్నది స్పష్టమవుతుంది. వీరిలో 80 శాతం మేరకు కాంట్రాక్టు పద్ధతిలో నియామకాలు పొందినవారే. 70 శాతం మంది

తమ ఇంటి పరిసరాల్లో పనులు చేసుకునే వారే. ఈ తరహా ఉపాధికల్పన పారిశ్రామిక ప్రగతికి ఎంత మాత్రం గీటురాయి కాదు.

గృహనిర్మాణ రంగంలో ఉపాధి 1993-94 లో 110 లక్షలు ఉండగా, 1999-2000 నాటికి 150 లక్షలయింది. ఇదే కాలంలో సంఘటిత రంగంలో ఈ నిర్మాణ పనుల కార్మికులు 12 లక్షల నుండి 11 లక్షలకు తగ్గిపోవడం గమనించదగ్గది. అసంఘటిత రంగంలో ఈ నిర్మాణ పనుల కార్మికులకు ఏ విధమైన హక్కులు- సౌకర్యాలు లభ్యం కావన్నది జగమెరిగిన సత్యం.

**పారిశ్రామికరంగం**

నూతన ఆర్థిక విధానాలు వేళ్ళూనుకుంటున్న తొలి నాళ్ళలో విదేశీ పెట్టుబడుల ప్రవేశం అసంఖ్యాకంగా ఉద్యోగాలను ఒనగూరుస్తుందని ఊదరగొట్టారు. 1991-92 లో 178 లక్షలడాలర్ల విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు మనదేశానికి వచ్చినప్పటికీ, ఈ పెట్టుబడుల ద్వారా వచ్చిన ఉపాధి గణాంకాలైతే లభ్యం కావడం లేదు. సంఘటితరంగంలో నిర్మాణ పనుల 90వ దశకంలో ఉపాధిమాత్రం 1.7 శాతం మేరకే పెరిగింది. 70వ దశకంలో 29.3 శాతం ఉండగా, 80 దశకంలో 16.9 శాతానికి తగ్గుదల నమోదయిందీ ఈ రంగంలోనే. మార్కెట్‌రంగంలో విదేశీ సంస్థల ప్రవేశ పుణ్యమా అని పలు స్వదేశీ సంస్థలు మూట-ముల్లె సర్దేసుకోవలసి వచ్చింది. తత్ఫలితంగా మొత్తం మీద ఉన్న కొద్దిపాటి ఉపాధికల్పనా కొండెక్కేయవలసి వచ్చింది.

**పట్టిక-5**
**పారిశ్రామికరంగం**
**పరిశ్రమల సంఖ్య, ఉపాధి, పెరిగిన విలువ.**

| సంవత్సరం | పరిశ్రమల సంఖ్య (వేలలో) | ఉపాధి (మిలియన్లలో) | ఉపాధి పెరుగుదల | పెరిగిన మూల్యం (కోట్లలో) |
|---|---|---|---|---|
| 1990-91 | 110.2 | 8.163 | 0.3 | 51.515 |
| 1993-94 | 121.6 | 8.708 | 0 | 88.434 |
| 1994-95 | 123.0 | 9.102 | 4.5 | 108.517 |
| 1995-96 | 134.6 | 10.045 | 10.4 | 139.397 |
| 1996-97 | 132.8 | 9.449 | -5.9 | 157.349 |
| 1997-98 | 136.0 | 9.998 | 5.8 | 166.441 |
| 1998-99 | 131.7 | 8.589 | -14.1 | 145.461 |
| 1999-00 | 131.6 | 8.193 | -4.8 | 154.974 |
| 2000-01 | 131.3 | 7.998 | -2.3 | 143.621 |

పదిమంది కన్నా ఎక్కువమంది కార్మికులతో, విద్యుత్‌తో పనిచేస్తున్న కార్ఖానాలను పరిగణలోకి తీసుకోవడమైంది.

(అన్యువల్ సర్వే ఆఫ్ ఇండస్ట్రీస్ ఆధారంగా)

పారిశ్రామిక ఉత్పత్తి డిమాండు స్థంబించి వుండడం మూలంగా పారిశ్రామికాభివృద్ధి నిదానంగా, నెమ్మదిగా చోటుచేసు కుంటుంది. వ్యవస్థలో ఆదాయం బహుకొద్దిశాతం మందికే పరిమితం కావడం, ఆ ఆదాయ వనరుల్లో స్వల్పశాతం మాత్రమే ఈ రంగ కొనుగోళ్ళకు వినియోగించడం జరుగుతుంది. డిమాండులో మార్పు తారతమ్యస్థాయిలో మార్పులకు లోనవుతూ వుంటుంది. తక్కువ వేతన సరకుల నుండి లగ్జరీ వస్తువుల వరకూ-వీటన్నింటిలో సర్వ సాధారణంగా వ్యవసాయరంగ వనరులకన్నా దిగుమతి వనరులకే స్థానం వుంటుంది.

ఉదాహరణకు సామాన్యుడు అతికష్టంమీద మిగుల్చుకున్న కొద్దిమొత్తంతో ధోవతులు కొనాలను కున్నాడనుకున్నాం. ఈ ధోవతులు తయారు చేసే కర్మాగారంలో ధోవతి తయారీ కార్మికులకే ఉపాధి కల్పించడం కాదు. పరోక్షంగా ధోవతీ తయారీకి అవసరమైన పత్తి ఉత్పాదనకు అవకాశాన్నిస్తుంది. అంటే రైతు పత్తి పంటకు డిమాండు లభిస్తుంది. ధోవతీల తయారీ కర్మాగారాలు వెలవాలంటే ఇందుకవసరమైన ఇనుము, సిమెంటు, తదితర రంగాలకూ డిమాండు పెరిగి తద్వారా ఉపాధి లభ్యమౌతుంది. తద్వారా అందరూ ఉపాధి పొందగలిగి కొనుగోలు శక్తిని పెంచుకోగలుగుతారు. వీరి 'కొనుగోళ్ళ' సంబంధిత రంగాల్లో డిమాండు పెరుగుతుంది. ఇదో జీవన చక్రం. ఇదంతా మన స్వదేశీ నైపుణ్యంతో నడిచేదే కావున అందరికీ ఉపయుక్తంగానూ వుంటుంది.

అదే, బొంబాయి నగరంలోని ఆర్థిక సంస్థకు చెందిన ఓ ధనికుడిని తీసుకుందాం. ఈయన తన సంపాదనలో పెను మొత్తాన్ని ఓ విదేశీ బ్యాంకు నిల్వలో జమ చేస్తాడు మొదట, అదీ అక్రమ పద్ధతుల్లో. కొద్ది మొత్తంలో తిండి-అదీ నక్షత్ర హోటల్‌లో, విదేశీ వస్త్రాలకు ఎగబడతారు. ఇంకా పెద్దమొత్తాలను విదేశీ కార్లకు, అధునాతన వస్తు సామాగ్రికి వెచ్చిస్తాడు. ఇవన్నీ విదేశీ నిపుణతను దిగుమతి చేసుకున్న వినియోగ వస్తువులే. తద్వారా ఈ తరహా మనిషి వినియోగంలో సైతం విదేశీ అభివృద్ధికే దోహదపడతాడు. ఈయన చేసిన పొదుపు సైతం 'ఉత్పత్తి' ని ప్రోత్సహించని కార్పొరేట్ వ్యవస్థకే దోహదపడుతుంది, అయితే ఈయన వినియోగించిన వినిమయం మాత్రం కొద్దిపాటి ఉపాధికల్పనకు దోహదపడుతుంది. దిగుమతి నిపుణతను రూపకల్పన చేసే పనివారికి, స్టార్‌హోటళ్లలో సిబ్బందికి, తన ఇంటి భద్రతా సిబ్బంది, పనివాళ్ళు తదితరంగా.. ఇప్పుడు మనం మొదట ప్రస్తావించిన ధోవతుల వినిమయ దారుడినీ, ఈ ధనిక వినియోగ దారుడ్నీ పోల్చి చూస్తే, స్వదేశీ వైశిష్ట్యానికీ, నిపుణతకు మొదటితరహా వినియోగదారుడే దోహదపగగలడని అవగతమౌతుంది. రెండోతరహా వినియోగం పరాధీనతకు పునాదులు వేస్తున్నట్టే కదా!

**ఇక నిరుద్యోగులకు సేవారంగమే ఆఖరి ఆశ్రయం :**

అదనంగా 115 లక్షల ఉద్యోగాలతో ఉపాధిని పొందేందుకు అనువైనది సేవారంగమే. ఈ సేవారంగంలో వాణిజ్యం, హోటళ్ళు, రెస్టారెంట్లదే అగ్రగామి స్థానం. 1993-94 నుండి 1999-2000 మధ్య కాలంలో 107 లక్షల ఉద్యోగాలు కల్పించబడ్డాయి ఈ రంగాల్లో. వస్తుతయారీ రంగం తర్వాత ఇంత పెద్ద సంఖ్యలో ఉపాధి ఈ రంగంలోనిలభ్యమౌతుంది. వాణిజ్య రంగానికొస్తే ఇక్కడ చిన్న వ్యాపారులు. ఒక మనిషే నిర్వహించగల తరహాలో నున్నవే అత్యధికంగా వుంటాయి. "వ్యవసాయరంగం" ఒకనాట నిరుద్యోగాన్ని మరో రూపంలో తనలో పదిలపర్చుకుంటే, నేడు 'సేవారంగం' ఏ ఉపాధి లేనివారికి 'పెద్ద దిక్కు'గా పరిణమిల్లుతుంది.

(మిగతాది 15వ పేజీలో)

# కాంట్రాక్టు సేద్యం-ఉపాధి కల్పన

- డా॥ అరిబండి ప్రసాదరావు

మన వ్యవసాయ రంగంలో 80 శాతం పైగా ఉన్న చిన్న కమతాల సమస్యల పరిష్కారానికి (5 ఎకరాల లోపు కమతాలు), వాటి ఆధునీకరణకు, వ్యవసాయ రంగంలో తేబోయే సంస్కరణలలో భాగంగా కాంట్రాక్టు సేద్యం తప్పనిసరి అని, దాన్ని ప్రోత్సహించడానికి పెద్ద ఎత్తున కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కార్యక్రమాలు చేపట్టాయి. వ్యవసాయరంగం మీద ఆధారపడే వారి ఆదాయాల్ని, వారి జీవన స్థాయిని పెంచడానికి కూడా కాంట్రాక్టు సేద్యం అవసరమని మన ప్రభుత్వాలు భావిస్తున్నాయి. కాంట్రాక్టు సేద్యం ద్వారా గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయ ఆధారిత, ప్రొసెసింగ్ పరిశ్రమలు ఏర్పాటు చేయాలని, దీని ద్వారా అధిక వేతనం వచ్చే వ్యవసాయేతర ఉపాధి పెంచవచ్చని, వ్యవసాయ ఆధునీకరణవల్ల వ్యవసాయరంగంలో ఉపాధి కోల్పోయే వారికి నూతనంగా స్థాపించే ఆ గ్రామీణ పరిశ్రమలలో ఉపాధి కలిపించవచ్చని కూడా ప్రభుత్వం భావిస్తుంది. ఇటీవల ఎన్నికల్లో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో పాలక పార్టీలు మారినా, వ్యవసాయ రంగంలో కాంట్రాక్టు సేద్యాన్ని పెద్ద ఎత్తున ప్రోత్సహించే విధానాన్ని పాటిస్తామని ప్రకటనలు చేయడమే గాక, బడ్జెట్ కేటాయింపులు కూడా వివిధ పథకాల క్రింద చేశాయి. అందువల్ల, కాంట్రాక్టు సేద్యానికి, ఉద్యోగ కల్పనకు మధ్య ఉన్న సంబంధం నేడు మనదేశంలో ఎంతో ప్రాధాన్యత కలిగి ఉన్నది.

ఉపాధికల్పనపై కాంట్రాక్టు సేద్య ప్రభావాన్ని పూర్తిగా అర్థం చేసుకోవడానికి, కాంట్రాక్టు సేద్యం స్వరూపం, స్వభావం మీద అవగాహన అవసరం. కాంట్రాక్టు సేద్యం మనకు కొత్తేమీ కాదు. ఒక విధంగా చెరుకు పండించి ఫ్యాక్టరీలకు సరఫరా చేయడం, పామాయిల్ చెట్లను పెంచి గెలలను ఆయిల్ ఫ్యాక్టరీలకు సరఫరా చేయడం, ఆయిల్ ఫెడ్, కాంట్రాక్టు సేద్యం నమూనాలే. అయితే, ఈ కాంట్రాక్టు సేద్యాలు, స్వయంపోషక విధానంలో భాగంగా దేశ అవసరాలు తీర్చడానికి ఏర్పాటు చేసినవి. కాని ప్రపంచీకరణ విధానాల నేపథ్యంలో ఏర్పాటు చేసే కాంట్రాక్టు సేద్యం దానికి పూర్తిగా భిన్నమైనది. ఇపుడు కాంట్రాక్టు సేద్యం ప్రధానంగా ఎగుమతి ప్రధాన లక్ష్యంగా ప్రోత్సహించబడుతూంది. ప్రస్తుతం వ్యవసాయ యంత్రసేకరణ శ్రమ తగ్గించే లక్ష్యంతో గాక, ఉత్పత్తి ఖర్చు తగ్గించి, లాభాలు పెంచే లక్ష్యాలతో జరుగుతుంది. అందువల్ల ప్రస్తుత కాంట్రాక్టు సేద్యం ఉపాధికల్పనపై తీవ్ర దుష్పరిణామం కలిగి ఉన్నది.

కాంట్రాక్టు సేద్యంలో ఉపాధికల్పన కంపెనీ ఒప్పందం కుదుర్చుకొనే పైరుమీద అనుసరించే సాంకేతిక అంశాల మీద, సేద్యంలో అది ప్రోత్సహించే యంత్రావసరాల మీద ప్రధానంగా ఆధారపడి ఉంటుంది. కాంట్రాక్టు సేద్యంలో పంటల వైవిధ్యం తగ్గడం సర్వ సామాన్యం. అందువల్ల, ఈ సేద్యంలో పంటకాలంలో కొన్ని రకాల ఉపాధికల్పన బాగా తగ్గి, మరికొన్ని రకాల పనులు పెరిగే అవకాశం ఉన్నది. అయితే ఉత్పత్తి లక్ష్యం ఉత్పత్తి ఖర్చు తగ్గింపుగాబట్టి, మొత్తం మీద కంపెనీ సేద్యం వల్ల, మామూలు కమతాలతో పోల్చినపుడు ఉపాధికల్పన తగ్గే అవకాశాలే ఎక్కువగా ఉన్నాయి.

**పంజాబ్ అనుభవం:**

మామూలుగా కాంట్రాక్టు సేద్యానికి కంపెనీలు పెద్ద రైతులతో ఒప్పందాలు చేసుకోవడానికి ప్రాధాన్యతనిస్తాయి. చిన్న కమతాల రైతులతో కాంట్రాక్టు సేద్యానికి ఒప్పందాలు కుదుర్చుకోడానికి అంతగా ప్రాధాన్యత నివ్వవు. పంజాబ్ కాంట్రాక్టు సేద్యంలో బహుళజాతి కంపెనీలయిన పెప్సీ, హిందూస్తాన్ లివర్ లిమిటెడ్, నిజ్జర కంపెనీలు స్థానిక కంపెనీ. ఇది నెస్లె కంపెనీతో టమాట సరఫరాకు కాంట్రాక్టు కుదుర్చుకుంది. టమాట, ఆలుగడ్డ సేకరణకు కాంట్రాక్టు సేద్యాన్ని చేబట్టి, పెద్ద రైతులతో ఒప్పందాలు చేసుకొన్నాయి. బహుళజాతి కంపెనీలు ఒప్పందం చేసుకొన్న కమతాలు సరాసరి సేద్యపు విస్తీర్ణం 72 ఎకరాలు (వ్యక్తిగత కమతాల సేద్యపు విస్తీర్ణం 53-93 ఎకరాల మధ్య ఉంది.) స్థానిక నిజ్జర కంపెనీ ఒప్పందం చేసుకొన్న కమతాల సరఫరా సేద్యపు విస్తీర్ణం 22 ఎకరాలు (వ్యక్తిగత కమతాల సేద్యపు విస్తీర్ణం 360 ఎకరాల మధ్య ఉన్నది) ఈ కమతాలలో కేవలం పంట మార్పిడివల్ల, అంటే గోధుమకు బదులు టమాట, ఆలుగడ్డల పెంపకం వల్ల ఉపాధికల్పన పంటకాలంలో పెరిగింది. కాని, వ్యక్తి గత కమతాలలో టమాట, ఆలుగడ్డల సేద్యంతో పోల్చినపుడు, కాంట్రాక్టు సేద్యంలో ఉపాధికల్పన తగ్గుతుందని పంజాబ్

అనుభవం చెబుతుంది. కాంట్రాక్టు సేద్యంలో పెద్ద కమతాల రైతులు సేద్యంలో యంత్రసేకరణకు ప్రాధాన్యత నివ్వటమే కాంట్రాక్టు సేద్యంలో ఉపాధికల్పన తగ్గిపోయిందని విశ్లేషణల్లో తేలింది.

పూల విత్తనాల కాంట్రాక్టు సేద్యంవల్ల పంజాబ్‌లో ఉపాధి పంటకాలంలో పెరిగిందని గమనించబడింది. విత్తనాల శుభ్రతకు, ప్రొసెసింగ్ ద్వారా అదనపు ఉపాధి కలుగుతుందని తేలింది. అయితే ఈ అదనపు ఉపాధి కొద్దికాలానికే పరిమితమైంది.

మనరాష్ట్రంలో కాంట్రాక్టు సేద్యం చిన్న కమతాల ప్రత్యేక సమస్యలకు పరిష్కారంగా చూపబడుతుంది. పెద్ద కమతాల రైతులు, కాంట్రాక్టులు పెప్సీలతో బేరసారాలు చేయడంలో ఒకమేర శక్తి కలిగి ఉంటారు. చిన్నరైతులకు కంపెనీ ఒప్పంద సమయంలో బేరసారాలు చేసే శక్తి చాలా బలహీనంగా, నామమాత్రంగా ఉంటుంది. అందువల్ల, పంజాబ్ కాంట్రాక్టు సేద్యంలో అనుభాలు ఆంధ్రప్రదేశ్‌లో చిన్న రైతుల సమస్యల పరిష్కారానికి నమూనాగా పనిచేయలేవు. ఇది చాలా ముఖ్యాంశం.

**చిన్న కమతాల కాంట్రాక్టు సేద్యంలో ఉపాధికల్పన:**

అయిదు ఎకరాల లోపు గల చిన్న కమతాలలో రైతులు సాధారణంగా స్వయంగా పనిచేస్తారు. కుటుంబ సభ్యులందరు అవసరాన్ని బట్టి పనిచేస్తారు. ఈ కమతాల రైతులు కాంట్రాక్టు సేద్యానికి కంపెనీతో ఒప్పందం చేసుకొంటే, ఉపాధికల్పనలో వచ్చే మార్పులు రైతుల బాగోగులను తీవ్రంగా ప్రభావితం చేస్తాయి.

ఈ కమతాల రైతుల ఆదాయంలో ప్రధాన వృత్తి, ఉపవృత్తులు రెండూ ప్రాధాన్యత వహిస్తాయి. ఉపవృత్తిలో వ్యవసాయ ఉత్పత్తిలో మిగిలే వ్యర్థ పదార్థాలు (ఉదహారణకు జొన్న, వరి పంటల్లో మిగిలే చొప్ప, వరిగడ్డి) సామాన్యంగా ప్రాధాన్యత వహిస్తాయి. పాడిపశువుల ద్వారా వచ్చే ఆదాయం లేని లభ్యత మీదే ఆధారపడి ఉంటుంది. గొర్ల, మేకల పెంపకం ద్వారా వచ్చే ఆదాయం ఆ కోవకు చెందింది. నేటి సంక్షోభ సమయంలో, రైతులకు జీవనాధారం ఈ ఉత్పత్తుల ఆదాయమే.

కాంట్రాక్టు సేద్యంలో కంపెనీతో ఒప్పందం కుదిరిన పైరునే వేయాల్సి ఉంటుంది. ఈ కొత్త పైరు నేరుగా రైతు ఆదాయాన్ని పెంచినట్లుగా అగుపడినా (ఎన్నో అధ్యయనాల్లో ఈ అంశం చెప్పబడింది), ఉత్పత్తుల ద్వారా పూర్తిగా లేదా పాక్షికంగా కోల్పోయే ఆదాయాల్ని ఇంతవరకు అందుబాటులో ఉన్న అధ్యయన ఫలితాలు పరిగణలోకి తీసుకోలేదు. అందువల్ల వ్యక్తిగత కమతాల సేద్యం నుండి కాంట్రాక్టు సేద్యానికి మార్పు మొత్తం మీద ఉపాధికల్పనకు, రైతు కుటుంబాల ఆదాయాల్ని పెంచకపోగా తగ్గిస్తుంది. ఈ విషయం చిత్తూరు జిల్లా కుప్పంవద్ద నిర్వహించబడే కాంట్రాక్టు సేద్యంలో ఈ రచయిత గమనించారు.

కొన్ని కాంట్రాక్టు సేద్యాల్లో, ముఖ్యంగా విత్తన ఉత్పత్తిలాంటి సేద్యంలో, పంట కాలంలో స్త్రీలకు, పిల్లలకు పని పెరుగుతుంది. ఈ పెరిగిన పని కొద్ది కాలానికే పరిమితమవుతుంది. ఈ పని వత్తిడి కాలంలో రైతు కుటుంబ సభ్యులందరు (పిల్లలతో సహా) అధిక కాలం తమ చేలో శ్రమ చేయాల్సి ఉంటుంది. ఈ విధంగా బాలకార్మికుల నిషేద చట్టం బెడద కంపెనీలకు ఉండదు. ఈ కుటుంబ సభ్యులకు 'వేతనం' కనీస వేతన చట్టం ఆధారంగా కాక, చివరకు పంటను అమ్మటం ద్వారా (రిస్క్ ఖర్చు అంచనా వేసిన తరువాత) వచ్చే ఆదాయంలో ఎంత మిగిలితే, దాన్నే పంచుకోవాల్సి ఉంటుంది. ఈ మిగులు ఆదాయం కనీస వేతనం కన్న చాలా తక్కువగా ఉంటుందని వేరే ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. అంటే, కాంట్రాక్టు రైతు కుటుంబ సభ్యులు తమ శ్రమను తామే దోచుకొనే దుస్థితి కాంట్రాక్టు సేద్యం వల్ల ఏర్పడుతుంది. అంటే, కాంట్రాక్టు సేద్య కంపెనీలకు కనీస వేతన చట్టం బెడద కూడా ఉండదు. పంట తరువాత కాలంలో, సేద్యపు పైర్లపై విద్య లేకపోవడం వల్ల, రైతు కుటుంబ సభ్యులు ఉపాధిని కోల్పోతారు. ఈ విషయం కూడా కుప్పం కాంట్రాక్టు సేద్య అధ్యయనంలో ఈ రచయిత గమనించారు.

అయితే, కాంట్రాక్టు సేద్యం వల్ల వ్యవసాయేతర ఉపాధి కొన్ని రంగాలలో కొంతమేర పెరగడానికి అవకాశం ఉన్నది. ముఖ్యంగా ప్రొసెసింగ్ పరిశ్రమ, రవాణా రంగాలలో ఉపాధికల్పన పెరగవచ్చు. ఈ పెరిగిన ఉపాధి సీజనల్‌గా ఉంటుంది.

మొత్తం మీద అంచనా వేస్తే, కాంట్రాక్టు సేద్యంవల్ల ఉపాధి అవకాశాలు పెరుగుతాయని ఖచ్చితంగా చెప్పలేం. అయితే, కొత్త పనులవల్ల ఉపాధికల్పన పెరిగినట్లుగా అగుపడవచ్చు. ఈ అంశం ప్రధానంగా తీసుకొని చేసిన సమగ్ర అధ్యయనాలు లేవు. అందుబాటులో ఉన్న అధ్యయనాలు కాంట్రాక్టు సేద్యంలో పండించే పంటకే పరిమితమై చేయబడ్డాయి. ఈ విషయంలో ఖచ్చితమైన నిర్ధారణలు చేయడానికి, మన దేశ పరిస్థితులలో వివిధ రకాల కాంట్రాక్టు సేద్యంలో పంటలు, భౌగోళిక, పరిస్థిల వైవిధ్యాన్ని దృష్టిలో పెట్టుకొని సమగ్ర అధ్యయనాలు చేయవలసిన అవసరం ఎంతో ఉంది.



# చర్చల సాఫల్యానికి ప్రజలే హామీ

- వి. కొమరయ్య

రాష్ట్ర ప్రభుత్వానికి, భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) పీపుల్స్‌వార్‌కు మధ్య చర్చల ప్రస్తావన ముందుకు కదలడం, రెండువైపుల నుంచీ అనుకూల చర్యలు జరిగి కొంత సానుకూల వాతావరణం ఏర్పడడం, రాష్ట్రంలో మళ్ళీ ఒకసారి ప్రజాస్వామిక, వాక్ సభా విశ్వాస స్వాతంత్ర్యాల పరిస్థితి నెలకొనడం ఆహ్వానించదగిన పరిణామాలు. అయితే ఈ అనుకూల పరిణామాలను వెన్నంటే కొన్ని ప్రతికూల వాదనలు, చర్యలు కూడ జరుగుతున్నాయి. విభిన్న రాజకీయ పక్షాలు, మేధావులు, ప్రచార, ప్రసారమాధ్యమాలు చర్చల వాతావరణాన్ని అభివృద్ధి చేసే దిశగా కాక, రంధ్రాన్వేషణ చేసి చర్చల వాతావరణాన్ని భగ్నం చేసే ప్రయత్నాలు చేస్తున్నాయి. ప్రభుత్వానికి చర్చలపట్ల ఎంత చిత్తశుద్ధి ఉన్నదో అర్థం కాని అయోమయం కొనసాగుతుండగా, అధికారవర్గం, ముఖ్యంగా కొందరు పోలీసు అధికారులు పనిగట్టుకుని చర్చలకు విఘాతం కలిగించే చర్యలు చేపడుతున్నారు. వారిని అదుపు చేయవలసిన ప్రభుత్వం, రాజకీయ నాయకత్వం చూసీ చూడనట్టు ఉండటంతో, రాజకీయ నాయకత్వపు చిత్తశుద్ధిని కూడ అనుమానించవలసి వస్తోంది. ఇంతకూ చర్చలు జరిగి, ప్రజాస్వామిక వాతావరణం నెలకొనాలని, నిర్బంధస్థితి నుంచి కొంత ఉపశమనం దొరికి శాంతియుతంగా, స్వేచ్ఛగా తమ ప్రజాస్వామిక హక్కులు కోరగలిగే స్థితి ఏర్పడాలని వాంఛిస్తున్న ప్రజల ఆకాంక్షలు మాత్రం విస్మరణకు గురవుతున్నాయి. అందరికన్నా ఎక్కువగా చర్చలను కోరుకుంటున్న సాధారణ ప్రజానీకం గొంతు వినిపించడం లేదు. ఎక్కడయినా వారి ఆకాంక్షలు వ్యక్తీకరణ జరిగినా, మళ్ళీ పోలీసుయంత్రాంగం భయభీతావహాన్ని వ్యాపింపజేస్తోంది. రెండు నెలలుగా చర్చల గురించి చర్చ జరుగుతున్నా, ఇప్పటికీ మొదటి అడుగయిన విధివిధానాల రూపకల్పన గాని, కాల్పుల విరమణ పై లిఖిత పూర్వక ఒడంబడిక గాని కుదరలేదు.

ఈ నేపథ్యంలో అసలు ప్రభుత్వానికీ పీపుల్స్‌వార్‌కూ మధ్య చర్చలు ఎందుకు అవసరమౌ, అవి ఏయే మలుపులు తిరుగుతున్నాయో, వాటిపట్ల ఏయే సందేహాలు తలెత్తుతున్నాయో విశ్లేషించడం అవసరం. అసలు వ్యవస్థను కాపాడే ప్రభుత్వానికీ, వ్యవస్థను కూలదోయదలచుకున్న పీపుల్స్‌వార్‌కూ మధ్య చర్చలేమిటి అనే వాదన ఒక చివరనా, ఈ చర్చల ద్వారానే పీపుల్స్‌వార్ కోరుతున్న విప్లవం రానున్నదనో, లేదా ప్రభుత్వం కోరుతున్నట్టు పీపుల్స్‌వార్ ఆయుధాలు వదిలేయ బోతున్నదనో వాదన మరో చివరనా ఉన్నప్పుడు, ఈ మొత్తం వ్యవహారాన్ని సంయమనంతో పరిశీలించి, ఎటువైపు చివరికీ వెళ్ళకుండా ఒక ఆచరణ సాధ్యమైన అవగాహనకు రావలసి ఉంది.

చర్చలకు సిద్ధపడడానికి ఇరుపక్షాలకూ పైకి చెపుతున్న కారణాలతో పాటు అంతర్గతమైన, బైటికి చెప్పని కారణాలూ ఉన్నాయి. ఉండటం సహజం కూడ. అట్లాగే చర్చల విషయంలో ప్రభుత్వ యంత్రాంగానికీ, పీపుల్స్‌వార్‌కూ కూడ అవగాహనలు మారుతూ వచ్చిన చరిత్ర ఉంది. అసలు అవతలి పక్షంతో చర్చలు ఏమిటి అని ఇరుపక్షాలూ ఒక పదిహేను సంవత్సరాలక కింద అనుకున్నాయి. క్రమక్రమంగా ఇరుపక్షాల వైఖరిలోనూ మార్పు వచ్చింది. ఈ మార్పుకు దోహదం చేసిన అనేక కారణాలలో 1996లో హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ ఎం ఎన్ రావు చర్చల ద్వారా అర్థవంతమైన శాంతిని నెలకొల్పాలని చేసిన సూచన, 1997 నుంచి పౌరస్పందన వేదిక చేస్తున్న ప్రయత్నాలు, 1999లో పత్రికా సంపాదకులు, పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్, విశ్వవిద్యాలయ అధ్యాపకులు చేసిన ప్రయత్నాలు కొన్ని మాత్రమే. ఈ కారణాలన్నిటి వల్ల 2002 నాటికి ఇరుపక్షాలూ చర్చలు జరిపేందుకు సిద్ధపడ్డాయి. ఇది కేవలం ఆ రెండు పక్షాలకు మాత్రమే సంబంధించిన వ్యవహారం కాదని, చర్చలలో ప్రజా సమస్యలు ప్రస్తావనకు వస్తున్నందువల్ల ప్రజలందరికీ, ప్రజా సంఘాలన్నిటికీ ఈ చర్చలలో పాత్ర ఉండాలని, చర్చల పరిధిని విస్తరిస్తూ పీస్ ఇనిషియేటివ్ కమిటీ ఏర్పడింది. అటు ప్రభుత్వమూ, ఇటు పీపుల్స్‌వార్ కూడ విధివిధానాల నిర్ధారణకోసం మొదటి మెట్టుగా తమ ప్రతినిధులను ప్రకటించాయి. ఆ ప్రతినిధుల మధ్య మూడుసార్లు చర్చలు జరిగాయి. కాని సమావేశం జరిగిన ప్రతిసారీ, సరిగ్గా, సమావేశానికి ముందు ఎన్‌కౌంటర్ హత్యలు జరపడం ద్వారా ప్రభుత్వం చర్చలపట్ల తన వైఖరి ఏమిటో ప్రకటించింది. ఆ రకంగా 2002 చర్చలు అర్థాంతరంగా ముగిసిపోయాయి.

ఆ తర్వాత జరిగిన నాటకీయ రాజకీయ పరిణామాలలో ముందస్తు ఎన్నికలకు వెళ్ళాలని తెలుగుదేశం ప్రభుత్వం భావించగా, ఆ ఎన్నికల ప్రణాళికలో నక్సలైట్లతో చర్చల వాగ్దానాన్ని భాగం చేసింది కాంగ్రెస్‌పార్టీ. అందువల్ల ఇప్పుడు జరుగుతున్న చర్చలకు కాంగ్రెస్ పార్టీ వైపు నుంచి ఎన్నికలు వాగ్దానాన్ని నెరవేర్చడమనే అంశం ఇమిడి ఉంది. అంతేగాక, తొమ్మిది సంవత్సరాల పాటు చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా సాగిన అణచివేత పాలనను చూసిన,

స్వయంగా కూడ అనుభవించిన కాంగ్రెస్‌పార్టీ, ఆ అణచివేతను ఓడించిన ప్రజాతీర్పును గౌరవించడం తన బాధ్యతగా ఎంచుకొంది. ప్రజాతీర్పులోని ఆ ప్రజాస్వామిక ఆకాంక్షను కాంగ్రెస్‌పార్టీ ఎంత వరకు గౌరవించగలుగుతుంది, పోలీసు వ్యవస్థ రూపంలోనో, స్వార్థ ప్రయోజనాల రూపంలోనో దానికి ఎటువంటి ఆటంకాలొస్తాయి, ఆ ఆటంకాలను అధిగమించగలుగుతుందా లేదా వంటి ప్రశ్నలకు కాలమే జవాబు చెపుతుంది.

ఎన్నికల వాగ్దానాన్ని నిలబెట్టుకోవడం, ప్రజా ఆకాంక్షను గౌరవించడం వంటి అంశాలతో పాటు కాంగ్రెస్ ప్రభుత్వానికి మాత్రమే గాక పాలక వర్గాలన్నిటికీ నిర్దిష్టమైన అవసరాలు కూడ ఉన్నాయి. తమ రాజకీయ పునాదిని కాపాడుకోవడానికీ, విస్తరించుకోవడానికీ గ్రామాలకు వెళ్ళవలసిన అవసరం, నిరంతరం ప్రజలను వేధిస్తున్న పోలీసుల పహరాలో గ్రామాలకు వెళితే ప్రజలనుంచి మరింత దూరమవుతామనే భయం. అందువల్ల పోలీసుల సహాయం అవసరం లేకుండా గ్రామాలకు వెళ్ళగలిగే అవకాశాన్ని చర్చలు ఇస్తాయేమోననే ఆశ దాదాపు అన్ని పాలకవర్గపార్టీల రాజకీయ నాయకులలో ఉన్నాయి. వారిలో చర్చలకు అనుకూల వైఖరికి మూలం ఇది. తొమ్మిది సంవత్సరాల చంద్రబాబునాయుడు పాలనలో నక్సలైట్లను హత్యచేస్తే ఇబ్బడిముబ్బడిగా డబ్బులు, రివార్డులు, ప్రమోషన్లు ముడతాయని చెప్పి పోలీసుయంత్రాంగాన్ని శాంతిభద్రతల యంత్రాంగం స్థాయినుంచి కిరాయి హంతకుల స్థాయికి ఉద్దేశ్యపూర్వకంగా దిగజార్చడం జరిగింది. హోం బడ్జెట్‌లో దాదాపు సగం నక్సలైట్ వ్యతిరేక కార్యకలాపాలకే వెచ్చిస్తూ, ఆ డబ్బుకు లెక్కల అడగని స్థితిని పాలకులు తెచ్చారు. అందువల్ల పోలీసు అధికారులలో ఒక బృందానికి నక్సలైట్ ఉద్యమం అణచివేతలో స్వార్థప్రయోజనాలు పెరిగిపోయాయి. వారు తమ కింది అధికారులను కూడ రెచ్చగొట్టి, ప్రలోభపెట్టి, నక్సలైటు ఉద్యమం మీద కత్తి కట్టేలా, విచ్చలవిడిగా హత్యలు చేసేలా ప్రోత్సహించారు. ఈ హింస సహజంగానే ప్రతిహింసకు దారితీసింది. అందువల్ల ప్రధానంగా ఉండవలసిన పోలీసుల శాంతిభద్రతల పరిరక్షణ పని, నక్సలైట్ల విప్లవోద్యమ నిర్మాణపు పని పక్కకు పోయి, పోలీసులకు-నక్సలైట్లకు మధ్య అనవసరమైన యుద్ధం కూడ జరగడం మొదలయింది. ఈ పరిణామాలు కొన్ని సంవత్సరాలు పాటు గడిచిన మీదట, దూకుడుగా నక్సలైటు వ్యతిరేక చర్యలు అమలు జరిపిన పోలీసు అధికారులు పకడ్బందీ రక్షణలో తప్ప బైటికి రాలేని స్థితి వచ్చింది. ఈ నిరంతర భయంబతుకు నుంచి బయట పడాలంటే, హింస ద్వారా, అణచివేత ద్వారా నక్సలైటు ఉద్యమాన్ని రూపుమాపాలనే అసాధ్యపు ఆలోచన మానుకోవాలి, చర్చల ద్వారా శాంతిని నెలకొల్పగలవేమో ప్రయత్నించాలని కొందరు పోలీసు అధికారులలో, ముఖ్యంగా వారి కుటుంబాలలో ఆలోచన మొదలయింది. నిజానికి ఇవాళ రాష్ట్ర పోలీసు అధికారులలో చర్చలు జరిగి శాంతి నెలకొనాలని భావించే వర్గం ఒకటి, చర్చలు జరిగితే తమ నిధులు, అవకాశాలు తరిగిపోతాయని భావించే వర్గం ఒకటి తయారయ్యాయి. ఈ రెండు వర్గాలలో ఏ వర్గానిది పై చెయ్యి అవుతుందో, ఏ వర్గం మాట వినాలని రాజకీయ నాయకత్వం భావిస్తుందో అనే దాని మీదనే చర్చల భవిష్యత్తు ఆధారపడి ఉంది. (నిజానికి ప్రజాస్వామ్యంలో రాజకీయ నాయకత్వానిదే అత్యున్నతాధికారం అయి, అధికార యంత్రాంగం ఏదయినా దానికి లోబడి ఉండాలి. మన రాష్ట్రంలో దురదృష్టవశాత్తు పోలీసు యంత్రాంగానిదే అత్యున్నతాధికారం అయిపోయి, వారిలో ఎవరి మాట రాజకీయనాయకత్వం వింటుందో అని ఆలోచించ వలసి వస్తోంది!)

మరోవైపు నక్సలైట్లలో కూడ ఉద్యమ నిర్మాణానికి అవసరమైన ప్రజాస్వామిక అవకాశాలను పెంచుకోవాలనే తపన మొదలయింది. దీర్ఘకాలిక సాయుధపోరాటం ద్వారా రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవడం అనే దృక్పథాన్ని మార్చుకోకుండానే, అందుకు ప్రజలను సన్నద్ధం చేయాలంటే చైతన్య వ్యాప్తి జరగాలని, అంటే వాక్, సభా, విశ్వాస స్వాతంత్ర్యాల అవకాశాలు పెంపొందాలనే ఆలోచన మొదలయింది. ఇది ఏదో పోలీసులకూ-నక్సలైట్లకూ మధ్య యుద్ధంలా, హింస-ప్రతిహింస చర్చలా, చంపడం-చావడం క్రీడలా కాకుండా మౌలిక ప్రజాసమస్యల మీద చైతన్యం పెంచే కృషి చేస్తూ, ఆ ప్రజా సమస్యలు పరిష్కారం కావాలంటే దోపిడీ వర్గాల పాలనను కూలదోసి, ప్రజారాజ్యాధికారాన్ని స్థాపించక తప్పదనే అవగాహనను ప్రజలకు ఇవ్వాలని ఆలోచన సాగింది. ప్రజా ఆకాంక్షల వల్లనే చర్చలకు సిద్ధపడుతున్నారు అని నక్సలైట్లు పదేపదే అంటున్న మాటకు అర్థం అదే, అలసిపోయినందువల్లనో, బలహీన పడినందువల్లనో, బలం పుంజుకోదలచుకున్నందువల్లనో చర్చలకు దిగివస్తున్నారని అనుకోవడం మేధావులకు ఆత్మసంతృప్తి కలిగించవచ్చు గాని అది వాస్తవం కాదు. ఒక రాజకీయ ఉద్యమం చేపట్టే చర్యకు ఇంతటి పైపై కారణాలు కాక లోతయిన రాజకీయ కారణాలు ఉంటాయాని గుర్తించి, వాటిని అన్వేషించాలి. 'దీర్ఘకాలిక సాయుధ పోరాటం, ప్రజా రాజ్యాధికారం అనేవి చర్చకు పెట్టే అంశాలు కావు. వాటిపై చర్చించబోవడం లేదు అని నక్సలైట్లు స్పష్టంగానే చెబుతున్నారు.

మరి వారు చర్చలకోసం ఎందుకు వస్తున్నట్టు? "యుద్ధం శాంతి రెండూ కూడ ఒకే క్రమంలో భాగాలు. ఇప్పుడు డెమొక్రటిక్ స్పేస్‌ను విస్తరించుకోవడం కోసమే శాంతి చర్చలకు సిద్ధపడ్డాం' అని వాళ్ళు చెపుతున్నారు.

నిజానికి మన రాజకీయార్థిక వ్యవస్థలోని విపరిణామాలకు ఇది నిదర్శనం. ఒక సాయుధ రాజకీయోద్యమం డెమొక్రటిక్ స్పేస్ కోసం చర్చలకు సిద్ధపడడం, ప్రభుత్వాలు తామే స్వయంగా కల్పించి, పరిరక్షించవలసిన డెమొక్రటిక్ స్పేస్ ఒక సాయుధ ఉద్యమం అడిగినప్పుడు తప్ప ఇవ్వడానికి సిద్ధపడకపోవడం!

చర్చలలోని రెండు పక్షాలకూ చర్చలకు రావడానికి ఇంత బలమైన కారణాలుండగా ప్రజలు చర్చలను కోరుకోవడమనేది వాటికి బలాన్ని చేకూర్చింది. మొత్తం వ్యవహారం హింస-ప్రతిహింస, చావడం-చంపడం విషవలయంలో పడిపోయినందువల్ల ప్రజలకు తమ సమస్యలను వ్యక్తీకరించడానికి, సృజనాత్మకమైన పరిష్కారాలు వెతకడానికి వీలులేని ఒక నిర్బంధ వాతావరణం ఏర్పడింది. ఆ నేపథ్యంలో ప్రజలు శాంతి కోరుకొంటున్నారు. అదేమీ శ్మశాన శాంతి కాదు. ప్రజలు తమ సమస్యలు ప్రకటించడానికి వీలులేని, పరిష్కారాలు కోరుకొనే వీలులేని నిర్బంధమయ నిశ్శబ్దం కాదు. ప్రజాస్వామిక స్ఫూర్తి వెల్లివిరిసే శాంతి. కాని తుపాకులు, తూటాలు, లాఠీలు, నిర్బంధం లేని శాంతి, తొమ్మిది సంవత్సరాలలో దాదాపు రెండువేల మంది తమ బిడ్డల్ని అన్యాయంగా పోగొట్టుకున్న తల్లిదండ్రులు, కుటుంబాలు, బహిరంగంగా ఏడవడానికి, బిడ్డల అంత్యక్రియలు గౌరవంగా జరపడానికి అవకాశం దొరకని కుటుంబాలు కనీసం ఈ దుస్థితి మారాలని కోరుకుంటున్నారు.

కనుక ఇవాళ చర్చలు కేవలం ఇరుపక్షాల కోరిక మాత్రమే కాదు. అది ప్రజల కోరిక. ఆ కోరికను ఎంతో కొంతమేరకు ఇరుపక్షాలు మన్నిస్తున్నందువల్లనే చర్చల ప్రక్రియ ముందుకు సాగుతోంది. ఆ ప్రక్రియ ముందుకు సాగగూడదని, 2002 లాగనే ఏదయినా ఆటంకాలు తలెత్తి, ఆగిపోవాలని, తద్వారా గ్రామసీమలలో భయ భీతావహ రాజ్యమే కొనసాగాలని బలంగా భావిస్తున్న వర్గాలు అటు కొన్ని రాజకీయ పార్టీల లోను, ఇటు పోలీసు వర్గాలలోను ఉన్నాయి. ఆ వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న కొన్ని ప్రచార, ప్రసార, మాధ్యమాలు, కొందరు మేధావులు చర్చలను భగ్నం చేసే, చర్చల స్ఫూర్తికి విఘాతం కలిగించే వాదనలను ముందుకు తెస్తున్నారు.

నక్సలైట్లు ఆయుధాలు వదిలితే తప్ప చర్చలు జరపగూడదని ఒక వాదన వినిపిస్తోంది. అసలు ఒక ప్రజాఉద్యమం సాయుధంగా ఉన్నది గనుకనే ఆ ఉద్యమంతో చర్చలు జరపడానికి ప్రభుత్వం సిద్ధపడిందనేది మొదటి విషయం. ఆ ప్రజా ఉద్యమం లేవనెత్తుతున్న మౌలిక ప్రజా సమస్యను పరిష్కరిస్తామని ప్రభుత్వాలు దశాబ్దాలుగా ప్రకటిస్తున్నాయి. వందలాది చట్టాలు తీసుకువచ్చాయి. ఆ సమస్యల పరిష్కారం డిమాండ్ చేస్తూ ఎన్నో శాంతియుత ఆందోళనలు జరుగుతున్నాయి. అయినా, దశాబ్దాలు గడిచిపోయినా, ఆ సమస్యల పరిష్కార దిశలో తొలి అడుగులు కూడ పడలేదు గనుకనే సాయుధ ఉద్యమాలు పుట్టుకొచ్చాయి. వ్యవస్థ మారితే తప్ప ఆ సమస్యలు పరిష్కారం కాదని వాదిస్తున్నాయి. ఆ ఉద్యమాల సాయుధ ఆచరణను ప్రశ్నించే ముందు, ఎవరికైనా ఆ సమస్యల పరిష్కారం శాంతియుతంగా, వ్యవస్థ లోపల సాధ్యమేనని చూపెట్టవలసి ఉంటుంది. దురదృష్టవశాత్తూ, ఆరు దశాబ్దాల "స్వతంత్ర" పాలన ఆ నమ్మకాన్ని వమ్ము చేసింది. అందువల్ల సాయుధ పోరాటం అనగానే ఏవగించుకోకుండా, సామాజిక సమస్యల పరిష్కార మార్గాలలో అదికూడ ఒకటని అంగీకరించవలసి ఉంటుంది. అంతేకాదు, ప్రజాస్వామ్యాన్ని అమలు చేసే చిత్తశుద్ధి లేని పాలకుల మెడలు వంచడానికి, వారి చేత ఎంతో కొంత ప్రజాస్వామ్యాన్ని పాటించేలా చేయడానికి, సాయుధ ఉద్యమాలు అవసరమని కూడ గుర్తించవలసి ఉంది. అందువల్ల ఇవాళ్టి చర్చలలో సాయుధ పోరాటం పట్ల విశ్వాసం అనేది అడ్డంకి కాగూడదు. కాకపోతే, చర్చలలో భాగంగా, ఇచ్చిపుచ్చుకోవడంలో భాగంగా, ఇరుపక్షాలు ఆయుధ ప్రయోగం మీద ఆంక్షలకు సిద్ధపడుతూ చర్చలు ప్రారంభించడం అవసరం. అంటే ఆయుధ ధారణ సమస్య కాగూడదు, ఆయుధ ప్రయోగం తగ్గింపు గురించి ఆలోచించవచ్చు. నిజానికి ప్రభుత్వ బలగాలు ఆయుధ ప్రయోగంలో చూపుతున్న విచ్చల విడితనంతో, నిరంకుశత్వంతో పోలిస్తే, సాయుధ ప్రజా ఉద్యమాల ఆయుధ ప్రయోగం చాలా తక్కువ.

చర్చలనేవి నక్సలైట్లకు ఎత్తుగడ మాత్రమేనని, వాటిని ఉపయోగించుకుని వాళ్ళు బలబడతారని, విరాళాలు, బలవంతపు వసూళ్ళు పోగుచేసి, ఆయుధాలు కొంటారని మరొక వాదన వినవస్తోంది. కమ్యూనిస్టుల పరిభాషలో వ్యూహం, ఎత్తుగడ అనేవి ముఖ్యమైన మాటలు. వాళ్ళ ఎత్తుగడ, మామూలు అర్థంలోని కుటిలత్వం కాదు. వాళ్ళకు ఎత్తుగడ అంటే తాత్కాలిక, స్వల్పకాలిక కార్యక్రమం వ్యూహం అంటే దీర్ఘకాలిక కార్యక్రమం. ఘర్షణ వ్యూహం కాగా ఐక్యత ఎత్తుగడ కావచ్చు. అదే రకంగా సాయుధ పోరాట వ్యూహం ఉంటూనే, చర్చలు అనే ఎత్తుగడ ఉండవచ్చు. ఆ సమయంలో వాళ్ళు బలపడతారనో, డబ్బులు, ఆయుధాలు పోగేసుకుంటారనో భయపడడం చౌకబారు విమర్శ. ఆ పనులు చేయడానికి వాళ్ళు అప్రజాస్వామిక పద్ధతులు ఉపయోగిస్తే తప్పనిసరిగా వి[illegible]భవలసిందే. ఖండించవలసిందే. కాని ఒక ప్రజా

ఉద్యమంగా బలబడేహక్కు, ప్రజాస్వామిక పద్ధతులలో వనరులు పోగుచేసుకునే హక్కు వాళ్ళకు తప్పనిసరిగా ఉంటుంది. ఉండాలి.

చర్చలలో సమస్యలు ప్రస్తావించి, ఆ సమస్యలు పరిష్కారమైతే వాళ్ళు ఉద్యమం వదిలేస్తారని మరొక వాదన వినవస్తోంది. ప్రజల ప్రయోజనాలకన్నా భిన్నంగా తమకేమీ ప్రయోజనాలు లేవని వాళ్ళు పదేపదే చెపుతున్నారు. అందువల్ల ప్రజా సమస్యలన్నీ రేపు చర్చల బల్లమీద ప్రస్తావనకు రావచ్చు. కాని అవి చర్చల బల్లమీద పరిష్కారమవుతాయని ఎవరైనా భావిస్తే అది అమాయకత్వమే అవుతుంది. సమాజం వర్గ సమాజంగా ఉన్నదని, ఒక వర్గం చేతిలో అధికారం, సంపద, ఉత్పత్తి సాధనాలు ఉన్నందువల్లనే, మరో వర్గం సమస్యలు ఎదుర్కొంటున్నదని అర్థం చేసుకుంటే, ఆ సమస్యల పరిష్కారం వర్గ అధికారం రద్దయినప్పుడు మాత్రమే సాధ్యమవుతుందని అర్థమవుతుంది. అంటే వ్యవస్థ మార్పు ద్వారా తప్ప సమస్యల మౌలిక పరిష్కారం జరగదు. కాకపోతే, ఆయా సమస్యలను మసిపూసి మారేడుకాయ చేయడం, పైపై మెరుగులు, అతుకులు, మాట్లు వేయడం జరగవచ్చు. ఇవాళ చర్చలలో కూడ అటువంటి పైపై పనులేవో జరగవచ్చు. అందువల్ల నక్సలైట్లు వ్యవస్థ మార్పుకోసం చేపట్టిన పోరాటాన్ని ఆపుకోవలసిన అగత్యమేమీ రాదు.

అసలింతకూ ఇదంతా చర్చలంటూ జరిగి, ఏవో కొన్ని సమస్యల మీద అటూ ఇటూ వాద ప్రతివాదాలు, ఏవో కొన్ని చర్యలు జరిగినప్పుడు. ఈ లోగానే చర్చల వాతావరణాన్ని చెడగొట్టడానికి పోలీసువర్గాలు శతవిధాల ప్రయత్నిస్తున్నాయి. ఎన్‌కౌంటర్లు జరిగి ప్రాణహాని జరగలేదన్న సంతృప్తి మినహా, ఇతరంగా పోలీసులలోని ఒక బృందం గత తొమ్మిది సంవత్సరాల్లో ఏయే పనులు చేసిందో అవన్నీ యథాతథంగా చేస్తోంది. సభలకు ఆటంకాలు కల్పించడం, బెదిరించడం, సభలకు హాజరయ్యేవారిని బెదిరించడానికి, వేధించడానికి వీడియోలు తీయడం, కేసులు పెట్టడం, కోవర్టు ఆపరేషన్లు నడపడం, పోలీసు అధికారులు రాజకీయ నాయకులు లాగ ప్రకటనలివ్వడం- అన్నీ జరుగుతూనే ఉన్నాయి. సరిగ్గా 2002 చర్చలకు భగ్నం చేయడానికి అప్పటి పోలీసు అధికారులు ఎటువంటి ప్రయత్నం చేశారో, అటువంటి ప్రయత్నాలనే ఇప్పుడు పోలీసు అధికారులు చేస్తున్నారు. రాజకీయ నాయకత్వం పైకి చర్చలకు అనుకూలంగా ఎన్ని మాటలు మాట్లాడినా, ఆ పోలీసు అధికారులను అదుపు చేసే ప్రయత్నం చేయడం లేదు.

కనుక చర్చల నాటకంలో మొదటి ఒకటి రెండు అంకాలు సక్రమంగానే నడిచినట్టు కనిపిస్తున్నాయి గాని ఈ నాటకంలోని అన్ని అంకాలూ సక్రమంగా నడుస్తాయనే హామీ ఇప్పటికైతే లేదు. చర్చలకు అనుకూలంగా ప్రభుత్వం దిగి వచ్చేలా చేసిన ప్రజలే చర్చల సంతృప్తికర కొనసాగింపుకు కూడ హామీ పడవలసి ఉంది. ❋

(9వ పేజీ తరువాయి)

**నూతన ఆర్థిక విధాన ఉద్యోగాలు:**

పెద్ద సంఖ్యలో సర్వీసురంగాల్లో ఉపాధి పొందినప్పటికీ జనస్రవంతిలో వారి స్థానం అంతంతమాత్రమే. ఆ ఖాళీని కంప్యూటర్ రంగ నిపుణులు, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ రంగ నిపుణలతో భర్తీ అవుతుంది. ఈ రెండు రంగాలకు చెందిన వారి సేవలు విదేశీరంగ సంస్థలకే సుమారుగా ధారాదత్తం సాఫ్ట్‌వేర్‌రంగం అయితే విదేశీ సంస్థల అవసరాల మేరకు డేటాలను-సమాచారాన్ని నిక్షిప్త పరుస్తుంది. రెండో ఇన్‌పర్మేషన్ టెక్నాలజీ..విదేశీ సంస్థల ఫోన్‌కాల్స్ తీసుకోవడం. వారి మెడికల్ రికార్డులను అనువదించడం. వారి లావా దేవీలను సరిచూడటం వంటి పనులకే పరిమితం. ఈ రెండు రంగాల్లోనూ ఉపాధి ఇటీవల కాలంలో అనూహ్యంగా పెరిగింది. 2003 నాటికే 490,000 మంది సాఫ్ట్‌వేర్‌రంగం లోనూ 160,000 మంది ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ లోనూ ఉపాధి పొందగలిగారు. ఇదే సమయంలో నాటకీయంగా సంఘటిత రంగంలో ఉపాధి కొరవడింది. ఇంతా చేస్తే ఈ రెండు రంగాల్లోనూ ఉపాధి పొందిన వారి శాతం మొత్తం నిరుద్యోగుల్లో 0.2 శాతం మాత్రమే (2004 గణాంకాలతో సరిచూస్తే) 2015 నాటికి 3.3 మిలియన్ల మందికి ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీతో ఉపాధి అమెరికాలో లభ్యమౌతుందని పారెస్టర్ రీసెర్చ్ సంస్థ తేల్చి చెపుతుంది. ఇందులో ఎంతమంది స్వదేశానికి తిరిగి వస్తారో తెలీదు. వచ్చే 11 ఏళ్లలో 20 లక్షల మందికి ఉద్యోగాలు అమెరికాలో రానున్నాయన్న మాట. ఈ సంఖ్యను ఏటా నిరుద్యోగ సేనలో చేరుతున్న యువతతో పోల్చి చూస్తే కేవలం రెండు శాతం మాత్రమే. స్వదేశీ పారిశ్రామిక సంస్థల్లో ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీకి అవకాశాలు బహుతక్కువ. అమెరికా వంటి దేశాల్లో ఎదురవుతున్న 'అవుట్ సోర్సింగ్' వివాహాలు ముదిరితే స్వదేశీ సంస్థల్లో మనుగడ వెతుక్కోవల్సిందే.

ఇదీ ఈ దేశంలోని నిరుద్యోగం విస్తరిస్తున్న తీరు. శ్రమ విలువ తగ్గితే నిరుద్యోగం అంతరించి పోతుందన్నది వింత వాదన తప్ప వాస్తవ ధృక్పదం లేదు. లాభాలకు అవకాశాలున్నాయా? లేదా? అన్నదే పెట్టుబడిదారీ ప్రశ్న. తప్పితే, భారతదేశంలో శ్రమశక్తిని సద్వినియోగం చేయాలనో, నిరుద్యోగాన్ని సమూలంగా నిర్మూలించాలను కోవడమో అర్థం లేనిది వాదనే. పనిచేయగల సామర్థ్యం, వయస్సు వున్న వారిలో కేవలం సగం మందికే ఉపాధిలభ్యంకాగా, మెజార్టీ మంది స్వయం ఉపాధి పథకాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నారు; తక్కువ వేతనాలకు సైతం ఉపాధిని కల్పించగల సత్తా మనపాలకులకు లేదు. అందుకనే సామ్రాజ్యవాదం మన వనరులను లోబర్చుకో చూస్తుంది. (విదేశీ పెట్టుబడులతో మగ్గిపోతోంది) విస్తారమైన ఉత్పాదనా సామర్థ్యం, కోట్లాది మానవ మేధస్సు-శ్రమ నిరర్థకంగా మిగిలిపోతుంది. ❋

(సంక్షిప్త స్వేచ్ఛానువాదం: విద్యాభూషణ్)

# గ్రామీణ ఆర్థిక వ్యవస్థ విచ్ఛిన్నమవుతుందా?

- ఇ.ఎ.ఎస్.శర్మ

**'రైతుల ఆత్మహత్యలు' ముంచుకొస్తున్న ప్రమాదానికి ఒక సంకేతం మాత్రమే. ఇందుకు దారితీస్తున్న గ్రామీణ ఆర్థిక వ్యవస్థ విచ్ఛిన్నానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. పెరిగిపోతున్న దారిద్ర్యానికి కారణంగా అనావృష్టిని చూపడం ఒకసాకు మాత్రమే. ఏవో కొన్ని సహాయక చర్యలు ప్రకటించినంత మాత్రాన గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో తలెత్తిన సంక్షోభం తొలగిపోదు"**

**ఆం**ధ్రప్రదేశ్‌ను సందర్శించిన ప్రముఖులు ప్రభుత్వ పాలనలోని సంస్కరణాయుత విధానాలు, హైటెక్ పద్ధతులను చూసి ప్రశంసించడం ఇంతకు ముందు వార్తలలో ఎక్కువగా కనిపించేది. ఇప్పుడు ఇందుకు భిన్నమైన పరిస్థితి కనిపిస్తోంది. మోయలేని అప్పుల భారం, దుర్భర దారిద్ర్యంతో అనేకమంది రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్న సంఘటనలు అందరి హృదయాలను కలచివేస్తున్నాయి. ప్రధానమంత్రి అయిన తరువాత తొలి పర్యటనగా మన రాష్ట్రానికి వచ్చిన డాక్టర్ మన్మోహన్‌సింగ్ కొన్ని బాధిత పేదరైతు కుంటుంబాలను కలుసుకొని ఉదార హృదయంతో ఘనమైన సహాయాన్నే ప్రకటించారు.

కర్నూలు జిల్లాలోని సోమయాజులుపల్లి, మహబూబ్ నగర్ జిల్లాలోని ధర్మపురి గ్రామాలను ప్రధాని సందర్శించి, బాధిత రైతు కుటుంబాలకు ఆర్థిక సహాయం, బియ్యం, తాజాగా బ్యాంక్ రుణాలు, ఆ కుటుంబాల వారి పిల్లల చదువుకోసం సహాయం తక్షణమే ప్రకటించారు. అలాగే, పనికి ఆహారం పథకాలు, చిన్ననీటి పారుదల చెరువులు, రహదారి నిర్మాణాలు, మంచినీటి సౌకర్యం, హాస్టళ్ళ నిర్మాణం వంటి పలు పథకాలను ఈ రెండు గ్రామాలకు మంజూరు చేశారు. ఒక గ్రామానికి పంచాయతీ భవన నిర్మాణం కూడా ఆయన ప్రకటించిన పథకాల్లో ఉంది. ఏ విధంగా చూసినా, ఆయన ప్రకటించిన పథకాలన్నీ అందరి హర్షామోదాలు పొందేవిగానే ఉన్నాయి.

ఆ రెండు గ్రామాలను డాక్టర్ మన్మోహన్‌సింగ్ సందర్శించి, బాధిత కుటుంబాలకు వివిధ పథకాలు ప్రకటిస్తున్న సమయంలోనే ఖమ్మం జిల్లాలోని వైరా మండలం, నారపునేని పల్లెలో మరోరైతు ఆత్మాహుతి చేసుకున్నాడు. తర్వాత కొద్ది రోజుల్లోనే నిజామాబాద్ జిల్లాలో ముగ్గురు, రాజమండ్రిలో ఒకరు, కడప జిల్లాలో ఇద్దరు, అనంతపురం జిల్లాలో ఒకరు ఆత్మహత్యలు చేసుకున్నారు. ఈ సందర్భంలో సహజంగానే కొన్ని ప్రశ్నలు తలెత్తుతాయి. సోమయాజుల పల్లి, ధర్మపురిలో ప్రధాని ప్రకటించిన సహాయం, పథకాలను నారపునేని పల్లి, ఇతర గ్రామాలలో కూడా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేస్తాయా? ప్రధాని లేదా మరో అత్యంత ప్రముఖుడు వచ్చి సహాయం ప్రకటించేదాకా ఆ గ్రామాలు ఎదురు చూడవలసిందేనా? ఆ రెండు గ్రామాలకు గాని, ఇతర చోట్ల గాని నిజంగానే గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి ఉపకరిస్తాయా? సంక్షోభ పరిష్కారానికి రాష్ట్ర ప్రభుత్వం వద్ద సరైన వ్యూహం ఏదైనా ఉన్నదా? లేదనే ఈ ప్రశ్నలకు సమాధానం లభిస్తుంది.

రైతుల ఆత్మహత్యల నేపథ్యంలో, గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఎదుర్కొంటున్న సంక్షోభాన్ని కొంచెం పరిశీలించవలసి ఉంది. అన్ని నిర్ణయాలు రాష్ట్ర రాజధానిలోనే జరుగుతుండడంతో గ్రామాలలో పాలనా వ్యవస్థ చితికిపోతోందనడంలో సందేహం లేదు. దేశం వెలిగిపోతోందని ఎంత గొప్పగా ప్రచారం జరిగినప్పటికి, బూటకపు సంస్కరణ విధానాల వల్ల గ్రామీణ పేదలకు మేలు జరగకపోగా, అవి మరింత హాని కలిగిస్తున్నాయి. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో ప్రబలుతున్న వాణిజ్యపరమైన విధానాలు సహజవనరులపై పేదలకు గల హక్కులను హరించి వేస్తున్నాయి. ఈ దుస్థితి అంతటికి అనావృష్టిని ప్రధానంగా చెబుతున్నా అది ఒక కారణం మాత్రమే. మన రాష్ట్రంలో గాని, ఇతర రాష్ట్రాలలో గాని పేదలు ఎదుర్కొంటున్న దుర్భర పరిస్థితికి ఇంకా చాలా సంక్లిష్టమైన, బలమైన కారణాలే ఉన్నాయి.

**ఉచిత విద్యుత్తు**

ప్రధాని మన్మోహన్‌సింగ్ ధర్మపురి గ్రామాన్ని సందర్శించిన సమయంలో, సమీప గ్రామానికి చెందిన రుణపీడితుడైన మాణిక్యనాయక్ అనే రైతు ఆత్మహత్యాయత్నం చేశాడు. వానలు సకాలంలో కురియక, తన జొన్నపంట ఎండిపోతోందనే వేదనతో అతడు ఆత్మాహుతికి యత్నించాడు. ఎంతో డబ్బు అప్పుచేసి, బోర్ తవ్వేందుకు చేసిన యత్నం విఫలం కావడంతో అతడు ఆత్మాహుతికి యత్నించాడు. అతడి భార్య అంతకు కొద్ది రోజులముందే ఆత్మహత్యకు పాల్పడింది. జలాధార పంటలవైపు రైతులను మళ్లించడం అందుకు తగిన పరిస్థితులను రాష్ట్ర ప్రభుత్వం కల్పించకపోవడమే ఈ దుస్థితికి కారణం. రైతులకు ఉచిత విద్యుత్ వాగ్దానం మంచి రాజకీయ వ్యూహమే అయినా, భూగర్భజలాల వినియోగాన్ని క్రమబద్ధీకరించలేనప్పుడు దీర్ఘకాలంలో దానివల్ల లాభంకంటే నష్టమే ఎక్కువగా కలుగుతుంది.

మరోకోణం నుండి కూడా దీనిని పరిశీలించాల్సి ఉంది. చాలా డబ్బు పెట్టుబడి పెట్టి బోర్ బావులు ఎవరు తవ్వించుకోగలుగుతారు? పెద్ద రైతులే. చిన్న, సన్నకారు రైతులు మళ్ళీ ఆధారపడేది సాధారణ బావులపైనే. బోర్ బావుల నుండి భారీగా నీటిని తోడడం వల్ల చిన్న రైతుల బావులకు నీరు అందడం లేదు. ఉన్న నీటినంతటిని సంపన్న

రైతులు కరెంటు మోటార్లతో తోడివేస్తున్నారు. విద్యుత్ సబ్సిడీ వల్ల ఎక్కువగా ప్రయోజనం పొందుతున్నది ఈ సంపన్న రైతులే. దీనికి తోడు తమ వద్ద గల మిగులు నీటిని చిన్న రైతులకు ఎక్కువ డబ్బు తీసుకొని అమ్ముతున్నది కూడా ఈ సంపన్న వర్గమే. కొందరు చిన్న రైతులు ఏదో విధంగా అప్పుతెచ్చి బోర్ బావులు తవ్వడానికి యత్నించినా, మాణిక్యంనాయక్ కుటుంబానికి పట్టినగతే వారికీ పడుతోంది.

బోర్ బావుల కథ అక్కడితో ఆగడం లేదు. బోర్ బావులకు వచ్చే రుణాలు, వ్యవసాయ విద్యుత్‌కు ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీపై మోజుతో రైతులు ఆహార పంటలు మానివేసి, ఖచ్చితమైన ఆదాయం ఇవ్వలేని చెరకు, పత్తి, పొద్దుతిరుగుడు వంటి భారీ పెట్టుబడులు అవసరమైన వాణిజ్య పంటల వైపు మొగ్గుచూపడంతో రైతులు మరింతగా రుణాల ఊబిలో కూరుకుపోతున్నారు. తమ ఉత్పత్తులను గిట్టుబాటు ధరలకు అమ్ముకోలేక పోవడంతో తక్కువ ధరలకే వాటిని తమ రుణదాతలకు వారు అప్పగిస్తున్నారు. పంట సరిగా చేతికి అందకపోవడమో, లేక తగిన గిట్టుబాటు ధర లభించకపోవడమో, వారిని మరింత దారిద్ర్యంలోకి నెట్టివేస్తోంది. గ్రామీణ ప్రాంతాలలో నీటి వాడకం పరిస్థితులు, పంటల విధానాన్ని దీర్ఘకాలిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని జాగ్రత్తగా విశ్లేషించవలసి ఉంది.

చిన్న రైతులకు ప్రయోజనం కలిగించే విధంగా నీటి నిర్వహణ, విద్యుత్ చార్జీలలో రాయితీలు, సరైన పంటల విధానం ప్రభుత్వం అనుసరించగలదా? ఇది మరో ప్రశ్న. పేదలకు సబ్సిడీలు ఇవ్వడంలో తప్పులేదు. కాని వారికి అవి సరైన ప్రయోజనం కలిగించేలా చర్యలు తీసుకొంటున్నారా? అన్నదే ముఖ్యం.

గ్రామీణ కుటుంబాలు రుణ బాధలలో మగ్గి పోవడానికి ఆరోగ్యం కోసం చేస్తున్న వ్యయం మరో కారణం. గ్రామాల్లోని ప్రజారోగ్య పరిరక్షణ వ్యవస్థ ఇప్పటికి కుంటుతూనే నడుస్తోంది. దానికి తగినంత నిధుల మంజూరు లేదు, సరైన సౌకర్యాల కల్పనా లేదు. ప్రభుత్వం అనుసరించే ప్రజారోగ్య విధానాలు సంపన్నవార్గాలకు ఎక్కువ ప్రయోజనం కలిగిస్తుండగా, పేదలు మరిన్ని సమస్యలు ఎదర్కొంటున్నారు. ఉదాహరణకు, 2004, జూన్ 1వ తేదీన 'ది హిందూ' దినపత్రిక లో వచ్చిన వార్త ప్రకారం, రాష్ట్రంలోని కొన్ని జిల్లాల ఆసుపత్రులకు గత తొమ్మిది నెలల నుండి కుక్క కాటుకు ఇచ్చే 'యాంటీ రాబీస్' వాక్సిన్ సరఫరాయే జరగడం లేదు. గ్రామాల్లో కుక్కకాటు సర్వసాధారణం. కాని దాని విరుగుడుకు ఇచ్చే వాక్సిన్ దొరకకపోవడంతో గ్రామీణులు నాటు మందులు వాడుతూ మరిన్ని చిక్కులు కొని తెచ్చుకోవలసి వస్తోంది.

ప్రైవేటు ఆసుపత్రులు తామరతంపరగా పెరిగిపోవడం కూడా గ్రామీణ, పట్టణ పేదల దుర్భరస్థితికి కారణమవుతోంది. ఈ ప్రైవేటు ఆసుపత్రుల్లో వైద్యం చాలా ఖర్చుతో కూడుకొన్నది కావడంతో గ్రామీణ పేదలు మరింతగా అప్పులలో కూరుకుపోతున్నారు.

గ్రామీణ పేదలు చెల్లించే డబ్బుకు తగినట్లుగా చక్కటి వైద్యాన్ని అందించేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకోగలదా? అన్నది మరో ప్రశ్న.

**వ్యవసాయేతర వర్గాలు**

గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఎదరుక్కొంటున్న సంక్షోభం వల్ల రైతులేగాక, వ్యవసాయంపై పరోక్షంగా ఆధారపడిన మరికొన్ని వర్గాలు కూడా తీవ్ర సమస్యలను ఎదుర్కొంటున్నాయి. వ్యవసాయ రంగంలో యంత్రాలు ప్రవేశిస్తుండడంతో నాగళ్లు, బళ్లు తయారు చేసే చేతి వృత్తులవారు ఉపాధి కోల్పోతున్నారు. ఉదాహరణకు డీజిల్‌తో నడిచే యంత్రాలు, విద్యుత్ పంపుసెట్ల వల్ల వడ్రంగి తయారు చేసే సంప్రదాయంగా నీరు తోడే పనిముట్లకు విలువ తగ్గిపోయింది. ట్రాక్టర్ వచ్చి నాగలికి పనిలేకుండా చేసింది. గ్రామీణ వడ్రంగులు తయారు చేసే ఎడ్ల బండి అవసరం కూడా పోయింది. వ్యవసాయ రంగంలో యాంత్రీకరణవల్ల తన ఉత్పత్తుల అవసరం పోయి, ఆకలి బాధ తాళలేక మరణించిన, నల్గొండ జిల్లా ముకుందాపురం గ్రామంలోకి బంగారు రమాచారి అనే వడ్రంగి దీనగాధ 'హిందూ' దిన పత్రికలో 2004, జూన్ 26వ తేదీన పి.సాయినాధ్ చక్కగా తెలియచేశారు.

గ్రామాలలో స్థానిక చేతి వృత్తులవారు తమ ఉపాధిని కోల్పోయి, కొత్త వృత్తులు చేయలేక, స్థానిక వడ్డీ వ్యాపారుల చేతుల్లో పడి నలిగిపోతున్నారు. యాంత్రీకరణ వల్ల ఉపాధి కోల్పోతున్న గ్రామీణ చేతివృత్తుల వారిని ఆదుకోవడానికి , వారి నైపుణ్యాన్ని పెంచి, వారి ఆదాయాన్ని మెరుగుపరచడానికి ప్రభుత్వం నిజంగా చర్యలేమైనా తీసుకోగలదా? ఇది మరో ప్రశ్న.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఇలా విచ్ఛిన్నం కావడం తెలంగాణా లోనేకాదు, రాష్ట్రంలోని మిగిలిన ప్రాంతాల్లో కూడా కనిపిస్తుంది. విశాఖపట్నం కోస్తా గ్రామాల్లోని జాలర్లు ఎంతటి దుర్భర పరిస్థితులను ఎదుర్కొంటున్నారో వారితో మాట్లాడినప్పుడు తెలిసింది. కొందరు ట్రాలర్లతో భారీగా చేపలు పడుతుండడంతో చిన్న స్థాయి జాలర్లకు తమ జీవనాధారమైన చేపలు లభించడం లేదు. ఈ కారణంగా చిన్న జాలరులు తమ వలలతో సముద్రంలో మరింత లోతుకు వెళ్లి చేపలు పట్టుకుంటూ ప్రాణం మీదకు తెచ్చుకుంటున్నారు. ఈ జాలర్లకు బ్యాంకులు తగినంతగా రుణాలివ్వక పోవడంతో వారు స్థానిక వడ్డీ వ్యాపారులపై ఆధారపడి అప్పులు ఊబిలో కూరుకుపోతున్నారు. నిరక్షరాస్యులైన ఈ జాలర్లు ఎక్కువ వడ్డీకి అప్పులు తీసుకొని తిరిగి తీర్చలేక దుర్భర దారిద్ర్యంలో మగ్గుతున్నారు.

యాంత్రిక పడవలతో చేపలు పట్టడాన్ని ప్రభుత్వం క్రమబద్ధీకరించి ఈ చిన్న జాలరులను ఆదుకోగలదా? అన్నది మరో ప్రశ్న. పోనీ వారి నైపుణ్యాన్ని పెంచివారు పట్టిన చేపలకు తగిన గిట్టుబాటు ధర కల్పించగలదా? అన్నది కూడా సందేహమే.

గృహనిర్మాణ పథకాలు అమలు జరుగుతున్న తీరులో లోపాలు కూడా గ్రామీణులు మరింతగా అప్పులపాలు కావడానికి దారితీస్తున్నాయి. స్థానిక కాంట్రాక్టర్లకు ప్రయోజనం కలిగేట్లుగా రూపొందించిన ఈ పథకాల వల్ల గ్రామీణులు తమ ఇళ్ళ నిర్మాణానికి అదనంగా ఎంతో ఖర్చు చేయవలసి వస్తోంది. ఆకర్షణీయమైన రుణపథకాలను చూసి మరింతగా అప్పులు చేయడం, ఇంటి నిర్మాణం మధ్యలో ఆపలేక అధికవడ్డీకి రుణాలు తేవడం, తిరిగి చెల్లించలేని రుణభారంతో కృంగిపోవడం గ్రామీణ పేదలకు సాధారణమైపోయింది. కాంట్రాక్టర్ల ప్రమేయం లేకుండా చేసి, తమ ఆదాయాలకు తగిన ఇళ్లను గ్రామీణులు నిర్మించుకొనే విధంగా ప్రభుత్వం పథకాలు రూపొందించగలదా?

గ్రామీణులకు రుణాలు అందించే సంస్థల విధానంలో కూడా మార్పు రావలసిన అవసరం ఉంది. వారి అవసరాలకు తగిన విధానాలు రూపొందించి స్నేహపూర్వక వాతావరణం పెంపొందించ గలిగితే వడ్డీ వ్యాపారుల బారిన పడకుండా గ్రామీణులు ప్రయోజనం పొందగలుగుతారు. ఇందుకోసం గ్రామాలలో పరపతి విధానాలను ప్రత్యేకంగా రూపొందించవలసిన అవసరం కూడా ఉంది.

గ్రామాలలో స్థానిక పాఠశాలలను అభివృద్ధి చేసి వాటికి తగినంత ఆర్థిక సహాయం అందిస్తామని కూడా ప్రధాని డాక్టర్ మన్మోహన్‌సింగ్ ప్రకటించారు. ఈ సందర్భంగా పరిశీలించవలసిన అంశం ఒకటి ఉంది. 'ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ' ద్వారా మరింతగా ఉపాధి అవకాశాలు పెంచుతామని గత ప్రభుత్వం అందరిలో ఆశలు పెంచిన విషయం అందరికి తెలిసినదే. ఆ వెంటనే చాలా సంస్థలు తగినంత నాణ్యతా ప్రమాణాలు లేకపోయినా, కంప్యూటర్ విద్య అందిస్తామంటూ తామరతంపరగా పుట్టుకొచ్చాయి. దాని ప్రభావం వల్ల చాలామంది విద్యార్థులు ఇంతకాలం నుండి చదువుతున్న వృత్తి విద్యలు మానివేసి, కంప్యూటర్ నేర్చుకోవడం వైపు మొగ్గు చూపారు. కాని వాటివల్ల కూడా తగినంత ప్రయోజనం లేకపోవడంతో రెంటికి చెడినరేవడి అయ్యారు. బహుళ ప్రచారం జరిగిన 'ఐ.టి. విద్య' కారణంగా వరకట్నం సమస్య కూడా బాగా పెరిగిపోయిందని గ్రామీణ కుటుంబాలవారు తల్లడిల్లుతున్నారు. కంప్యూటర్ విద్య నేర్చినవరుడు కోరే కట్నం ఇవ్వలేక గ్రామీణ కుటుంబాలవారు కొత్త సమస్యలను ఎదుర్కొనవలసి వస్తోంది. మిథ్యా ప్రయోజనాలు ఆశ చూపుతున్న ఐ.టి. కోర్సులు బోధించే సంస్థలను ప్రభుత్వం క్రమబద్ధీకరిస్తోందా మరి? గ్రామీణ ప్రాంతాల అవసరాలకు తగినట్లుగా విద్యాసంస్థల ప్రమాణాలు రూపొందించడానికి ప్రభుత్వం కృషి చేస్తోందా? అనేది మరో ప్రశ్న.

మహబూబ్‌నగర్ జిల్లాలోని ధర్మపురి గ్రామంలో పంచాయతీ భవనం ఏర్పాటు చేస్తామని కూడా ప్రధాని తమ పర్యటన సందర్భంగా ప్రకటించారు. ఇది కూడా పరిశీలించవలసిన విషయమే. రాజ్యాంగ ప్రతిపత్తి కలిగిన పంచాయతీ సంస్థలు నిజంగా వాటి విధులను అవి నిర్వహిస్తే, నిర్వహించేట్లు ప్రభుత్వం చేయగలిగితే, పైన పేర్కొన్న అనేక గ్రామీణ సమస్యలు నిజంగానే చాలా తేలికగా పరిష్కారమవుతాయి. కాని దురదృష్టవశాత్తు, ఆంధ్రప్రదేశ్‌తో పాటు ఎక్కడా ఈ సంస్థలు సమర్థవంతంగా పని చేసే అవకాశాన్ని రాష్ట్ర ప్రభుత్వాలు కల్పించడం లేదు. పై పెచ్చు, పంచాయతీలను పటిష్టం చేసేందుకు కేంద్రం ఏవైనా చర్యలు తీసుకుంటే ఫెడరల్ వ్యవస్థ మాటున రాష్ట్రాలు వాటిని ప్రశ్నిస్తున్నాయి. ఒకవేళ ప్రధాని అన్నట్లుగా ధర్మపురిలో చక్కని పంచాయతీ భవనం నిర్మించినా, అది పనిచేయని పంచాయతీ మాత్రమే అవుతుందనడంలో సందేహం లేదు. రాజ్యాంగంలో ప్రతిపాదించిన అధికారాలను ప్రభుత్వాలు పంచాయతులకు కల్పించగలవా? అన్నది ధర్మసందేహమే మరి.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థ క్రమంగా విచ్ఛిన్నం కావడానికి దోహదం చేస్తున్న కారణాలను ఇంతవరకు పరిశీలించాం. బలమైన ప్రజా ప్రాతినిధ్యం గల సంస్థలు లేకపోవడమే గ్రామీణ ఆర్థిక వ్యవస్థ విచ్ఛిన్నం కావడానికి మొదటి కారణం. అందువల్ల స్థానిక సంస్థలను బలోపేతం చేయడం తక్షణ కర్తవ్యంగా ప్రభుత్వాలు భావించాలి. యాంత్రీకరణ కారణంగా గ్రామీణులు తమ ఉపాధి అవకాశాలు కోల్పోవడం గ్రామీణ ఆర్థిక వ్యవస్థ విచ్ఛిన్నానికి రెండవ కారణం. ఉదాహరణకు, సముద్రవనరులపై జాలరులకు హక్కును కల్పించడం వంటి చర్యలు తీసుకోవచ్చు. పేదలు, చిన్నరైతుల ప్రయోజనాలకు తగిన గ్రామీణ వనరులపై వారికి గల హక్కులను నిర్దష్టంగా నిర్వహించవలసిన అవసరం కూడా ఉంది. దీనికి తగినట్లుగా ప్రభుత్వం తన ఆర్థిక, ఇతర విధానాలను రూపొందించుకోవాలి. సంస్కరణల విషయంలో పాశ్చాత్య విధానాలు అనుసరించడం మానుకొని, దేశీయ విధానాలను రూపిందించుకోవాలి.

రైతులు వడ్డీ చెల్లింపులపై ఆరునెలల మారిటోరియాన్ని ప్రభుత్వం ఇటీవల ప్రకటించింది. ఇది తాత్కాలికంగా మంచి చర్యే అయినా, ఇటువంటి సంక్షోభం మళ్లీమళ్లీ తలెత్తకుండా ప్రభుత్వం ఒక సమగ్రమైన వ్యూహం రూపొందించడం అవసరం. ఉత్తరకోస్తా జిల్లాలలో చాలామంది చిన్నరైతులు తమకు ఉన్న కొద్దిపాటి పొలాన్ని సైతం అమ్మివేసి, పట్టణాలు, నగరాలకు వలస వెళ్లి దినసరి కూలీలుగా బతుకుతున్నారు. ఈ విషయాన్ని కూడా ప్రభుత్వం లోతుగా పరిశీలించి తగిన చర్యలు తీసుకోవలసి ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం ఉత్పన్నమైన పరిస్థితే మరికొన్ని రాష్ట్రాలలో కూడా తలెత్తే ప్రమాదం ఉంది. ఎందుకంటే అక్కడి రైతుల పరిస్థితి కూడా ఇదే. ఎటువంటి జాప్యం లేకుండా, రైతుల ఆత్మహత్యలు మరింతగా పెరగకుండా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఒక సమగ్రమైన వ్యూహాన్ని రూపొందించి తక్షణమే అమలు చేయాలి. ఇది రాస్తున్న సమయానికి కూడా, రాష్ట్రంలో రైతుల ఆత్మహత్యల వార్తలు రోజూ పత్రికలలో వస్తూనే ఉన్నాయి. అందుకే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తక్షణమే స్పందించి తగిన చర్యలు తీసుకోవాలి.



'ఎకనామిక్, పొలిటికల్ వీక్లీ సౌజన్యంతో'

(స్వేచ్ఛానువాదం: ఎ.వి.వి.ప్రసాద్)

# బీమారంగంలో విదేశీ పెట్టుబడుల వివాదం-పెరుగుతున్న ప్రతిఘటన

- వై. కృష్ణమూర్తి

మన దేశ ఆర్థికమంత్రి బడ్జెట్ ప్రతిపాదనల్లో బీమారంగంలోని విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల పరిమితిని 26 శాతం నుండి 49 శాతం పెంచే ప్రతిపాదన ప్రైవేటు సంస్థల అధిపతులకు మధుర సంగీతంగా వీనుల విందు చేసింది. మన దేశ ముఖ్య పెట్టుబడిదారులందరూ విదేశీ బీమా సంస్థలతో కలిసి ఉమ్మడి సంస్థలు ఏర్పరిచారు.

('హిందూ' 9, జూలై 04)

“మొదటి యుపిఏ ప్రభుత్వం చేసిన అభివృద్ధికరమైన సిఫార్సులు ఇన్సూరెన్స్ వ్యాపారాన్ని విస్తరించడానికి, ఇన్సూరెన్స్ రక్షణను మరింత మందికి లబ్ధిచేకూర్చడానికి” తోడ్పడుతుందని రాయల్ సుందరం అలయెన్స్ ఇన్సూరెన్స్ కంపెనీ మానేజింగ్ డైరెక్టర్ అంథోని జోసెఫ్, “నేను ఇండియా వచ్చిన తర్వాత ఇంత మంచి వార్త ఎపుడూ వినలేదు” అని ఇంగ్ వైశ్యాలైఫ్ ఇన్సూరెన్స్ కంపెనీ లిమిటెడ్ మానేజింగ్ డైరెక్టర్ ఫ్రాంక్ కోస్టర్ తమ సంతోషాన్ని వెలిబుచ్చారు. చిదంబరం ప్రవేశ పెట్టిన బడ్జెట్ ప్రతిపాదనలకు ప్రైవేటు సంస్థల అధిపతుల ప్రతిస్పందనలో ఇవి కొన్ని మాత్రమే. వారందరు చంకలు కొట్టుకోవటంలో ఆశ్చర్యం లేదు. బీమా రంగంలో విదేశీ పెట్టుబడుల పెంపుదలను కోరుతూ యన్‌డిఏ ప్రభుత్వం మీద విదేశీ సంస్థలు వత్తిడి తెచ్చాయి కాని బి.జె.పి. లో ఒక భాగం వ్యతిరేకించటం, వామపక్షాలు, కార్మిక వర్గాలు తీవ్రంగా వ్యతిరేకించి పెద్ద పోరాటం సాగించటం, కాంగ్రెస్ తన రాజకీయ లబ్ధి కొరకు 26 శాతం మించకూడదని అనాడు తీసుకొన్న నిర్ణయం 49 శాతం పెంచేందుకు యన్‌డిఎ కు అడ్డంకిగా నిలిచాయి. బి.జె.పి. చేయలేని సాహసం, మధ్యే మార్గం అని చెప్పుకొనే కాంగ్రెస్ ప్రభుత్వం చేయటం పారిశ్రామికవర్గాలనే ఆశ్చర్యపరచింది.

**50 కోట్లు పెట్టుబడితో 65,000కోట్ల మార్కెట్ ప్రవేశం**

జాతీయ జీవిత బీమా సంస్థ 2003-04 ఆర్థిక సంవత్సరంలో రూ. 84895 కోట్లు, వివిధ ప్రభుత్వ, సామాజిక, ప్రైవేటు రంగాలకు పెట్టుబడిగా సమకూర్చింది. అదే కాలంలో సుమారు రూ.65,000 కోట్లు ప్రీమియముగా పట్టాదారుల నుండి వసూలు చేసింది. జాతీయ సాధారణ బీమా సంస్థలు రూ.13,000 కోట్లకు పైబడి ప్రీమియము వసూలు చేశాయి. ఈ అపారమైన ఆర్థిక వనరులు చేజిక్కించుకోవాలనే ఆశ ఎవరికైనా కలుగుతుంది. ముఖ్యంగా లాభమే ప్రేరణగా కలిగిన అమెరికా పెట్టుబడిదారులకు మరీను. గత 15 సంవత్సరాలుగా స్వేచ్ఛా ప్రపంచం, వ్యాపారం పేరునా, ప్రపంచీకరణ పేరునా భారత బీమారంగ ద్వారాలను విదేశీ పెట్టుబడుల ప్రవేశానికి తెరవాలని వత్తిడి ఎక్కువైంది. ఆ కారణంగానే పాలకవర్గాలు 1999లో “బీమా నియంత్రణ మరియు అభివృద్ధి యంత్రాంగం” ఏర్పరుస్తూ చట్టం చేశాయి. అనాడు ఆర్థికమంత్రి శ్రీ యశ్వంత్ సిన్హా, బీమా రంగంలో విదేశీ పెట్టుబడుల ప్రవేశానికి వున్న తీవ్ర వ్యతిరేకతను తగ్గించేందుకు 26 శాతం సీలింగును చట్టంలో చేర్చారు. వస్తు వాణిజ్యంతో పాటు సేవలరంగం కూడా ప్రపంచ వాణిజ్య పరిధిలోకి వచ్చిన తరువాత విదేశీ పెట్టుబడుల పరిధుల తొలగింపుకు ప్రభుత్వం మీద ఒత్తిడి ఎక్కువైంది. దీనికి తోడు ఎన్.డి.ఏ. ప్రభుత్వం సంస్కరణల పేరన వున్న పరిధులు తొలగించటానికి సిద్ధపడింది. ఆ ప్రభుత్వం నియమించిన శ్రీ యన్.కె.సింగ్ (ప్రణాళికా సంఘ సభ్యులు) 2001లో చేసిన సిఫారసులు కూడా బీమా రంగంలో విదేశీ పెట్టుబడుల శాతం పెంపుదల ప్రవేశానికి దోహదం చేశాయి. 2004 ఎన్నికలు ఎన్.డి.ఏ. ప్లానును తలక్రిందులు చేశాయి.

1999లో బీమా నియంత్రణా యంత్రాంగ చట్టం ద్వారా భారత జీవిత బీమా సంస్థకు, జాతీయ సాధారణ బీమా సంస్థకు వున్న ఏకాధిపత్యం తొలగింపబడి, దేశీయ పెట్టుబడిదారులతో కలిసి విదేశీ బీమా సంస్థలు ఉమ్మడి సంస్థలు ఏర్పరచుకొని బీమా రంగంలో ప్రవేశించడానికి వీలు కలిగింది. గత మూడు సంవత్సరాలుగా ఈ ఉమ్మడి సంస్థలు దేశమంతటా తమ కార్యకలాపాలను సాగించాయి.

బీమా రంగంలో విదేశీ పెట్టుబడుల ప్రవేశానికి చూపిన సాకు, చైనా విదేశీ పెట్టుబడుల ప్రవేశానికి అనేక ఆకర్షణ కార్యక్రమాలు చేపట్టిందని, దానిలో భాగంగా బీమా రంగం తెరుస్తోందని, ప్రపంచ వాణిజ్య సంస్థలో కూడా చైనా చేరుతోందని దానివల్ల చైనా కూడా అన్ని పరిమితులు తొలగించాల్సిన అవసరం ఏర్పడుతోందని వాదించారు. చైనా బీమా రంగంలో విదేశీ పెట్టుబడులను 25 శాతం మించి అనుమతించలేదు. భారతదేశంలో రూ.50 కోట్లతో విదేశీయులు ఇన్సూరెన్సు కంపెనీలో ప్రవేశించవచ్చు. అదే చైనాలో అయితే కనీసం రూ.120 కోట్లు పెట్టుబడితో విదేశీయులు ముందుకు రావాలి.

అనాడూ, నేడు బీమా రంగంలో విదేశీ పెట్టుబడులు ప్రవేశానికి అనుకూలంగా ముఖ్యంగా మూడు కారణాలు చూపుతున్నారు. 1) జాతీయ బీమా సంస్థలు బీమా సదుపాయాన్ని ప్రజానీకానికి మందకొడిగా అందించుతున్నాయి. అటు బీమా వ్యాప్తిలోనూ, ఇటు సేవలు అందించటంలోను అలసత్వం వున్నదనే నింద(2) ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం విదేశీ సంస్థలు తెస్తాయి. (3)ప్రాతిపదిక సౌకర్యాలకు ఆర్థిక వనరులు ఎక్కువగా లభిస్తాయి.

**గడచిన మూడు సంవత్సరాల అనుభవం**

బీమా వ్యాప్తి ప్రజల ఆదాయం మరియు కొనుగోలు శక్తిపై ఆధారపడి ఉంది. జాతీయ స్థూల ఉత్పత్తిలో ప్రీమియం వసూళ్ళ

భాగం పరిశీలించిన 2000-01 సంవత్సరంలో 2.14 శాతంగాను, 2001-02 లో 2.73 శాతంగాను, 2002-03 లో 2.86 శాతంగాను నమోదైంది. ఈ వ్యాప్తిలో కూడా ప్రభుత్వ రంగ సంస్థలు పెద్దపాత్ర వహించాయి. ఉదాహరణకు జాతీయ జీవిత బీమా సంస్థ 2003-04 లో 270 లక్షల నూతన పట్టాలు జారీ చేయగా ప్రైవేటు రంగంలోనున్న 12 సంస్థలు కలిపి 17 లక్షల పట్టాలు మాత్రమే జారీ చేశాయి. జాతీయ సాధారణ బీమా సంస్థ రూ.14,000 కోట్లు ప్రీమియం వసూలు చేయగా ప్రైవేటు రంగంలోని అన్ని సంస్థలు కలిసి రూ.2,400 కోట్లు ప్రీమియం వసూలు చేశాయి. క్లెయిములు చెల్లింపులో జాతీయ బీమా సంస్థలు ప్రపంచంలోనే అగ్రభాగాన వుండగా ప్రైవేటు సంస్థలు గత నాలుగు సంవత్సరాల క్లెయిములు చెల్లింపు వివరాలు నేటివరకు ప్రకటించలేదు. ప్రజలు ఆకలిబాధలు, నిరుద్యోగంతో బాధపడుతుంటే బీమారక్షణ కొనుగోలు పెరుగుదల నత్తనడకే నడుస్తుంది.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంలో కూడా జాతీయ బీమా సంస్థలు అన్ని నవీన పద్ధతులు అమలుకు తెచ్చాయి. జీవిత బీమా సంస్థ తమ 100 డివిజన్లు, 2048 శాఖా కార్యాలయాలను నెట్‌వర్కింగ్‌లోకి తెచ్చింది. పట్టాదారులకు 'ఇ' క్లియరెన్స్ ద్వారా, ఎ.టి.ఎం. ద్వారా, ఇంటర్‌నెట్ ద్వారా ప్రీమియం చెల్లించే వసతులు కల్పించింది. ఈనాడు మన జాతీయ బీమా సంస్థలు విదేశాలలో శాఖలు తెరచుటకు ప్రయత్నిస్తున్నాయి. సాంకేతిక పరిజ్ఞానాన్ని సంపూర్తిగా వినియోగించుకొంటున్నాయి. ఐ.టి. రంగంలోను కంప్యూటింగ్ రంగంలోను మనదేశ శక్తి సామర్ధ్యాలను మించి ఇతర దేశాలు లేవు. అందువల్ల ప్రత్యేకమైన సాంకేతిక సహాయం కావలసివస్తే దాన్ని కిరాయికి తెచ్చుకొనవచ్చును లేక అంతర్జాతీయ మార్కెట్టులో కొనుగోలు చేయవచ్చును.

**బీమా చేసిన పట్టాదారులకు రక్షణ**

జాతీయ జీవిత బీమా సంస్థ దీర్ఘకాలిక పట్టాలను అధికంగా అమ్ముతుంది. అవి మెచ్యూర్ అగుటకు 25 నుంచి 30 సంవత్సరాలు పడుతుంది. ఈ లోగా పోగయ్యే ప్రీమియం జాతీయ ప్రణాళికలకు, ఆర్థిక వనరులుగా వుపయోగించుతోంది. మన ప్రైవేటు సంస్థలు జారీ చేసే పట్టాలలో అధికభాగం చట్టా వ్యాపారంతో ముడిపడిన యూనిట్ లింక్‌డ్ పాలసీలు. వీటి ద్వారా పోగయ్యే మిగిలే ప్రీమియం తక్కువ. పోగైన ప్రీమియం ఎప్పటికప్పుడు షేరు మార్కెట్టులోకి వెళుతుంది కానీ మౌలిక సౌకర్యాల కల్పనకు ఉపయోగపడదు.

ధాబోల్ పవర్ ప్రాజెక్టు విషయంలో ఎన్‌రాన్ పాత్ర అందరికీ తెలిసిందే. అలాగే బ్యాంకుల కుంభకోణంలో విదేశీ బ్యాంకుల పాత్ర అధికం అనే విషయం బయట పడింది. బీమా రంగంలో కూడా అనైతిక లావాదేవీలు నడుపుతూ, వాల్యుయేషన్ మిగులు వాల్యుయేషన్ సర్‌ప్లస్ లేకపోయినా వాటాదారుల నిధుల నుండి పట్టాదారుల ఖాతాకు బదిలీ చేసి బోనస్ ప్రకటించుతున్నారు. దీనిలో ఐ.ఆర్.డి.ఏ. అలసత్వం కూడా ఉన్నది. గత రెండు సంవత్సరాలుగా ప్రైవేటు సంస్థలు ఈ అనైతిక చర్యలు చేస్తున్నా కదలక, అనేకమంది విమర్శించిన తరువాత 23-3-04న ప్రైవేటు సంస్థలు లేకుండా బోనస్ డిక్లేర్ చేయకూడదనే నిబంధనను గట్టిగా అమలు చేయాలని ఐ.ఆర్.డి.ఏ. ఆదేశించింది.

**లాభాలు ప్రైవేట్ బీమా సంస్థలకు-నష్టాలు జాతీయ బీమా సంస్థలకు**

లాభసాటి అయిన అగ్ని ప్రమాదం, దొంగతనాలు, పారిశ్రామిక ప్రమాదాలు, నౌకా బీమా మొదలగు సాధారణ బీమా పట్టాలు ప్రైవేటు సంస్థలు జారీ చేస్తున్నాయి. నష్టదాయకరమైన మోటర్ ఇన్సూరెన్స్ విభాగంలోకి చొరవబడుటలేదు. నష్టాలు జాతీయ బీమా సంస్థలు భరించగా లాభాలు ప్రైవేటు సంస్థలు మింగివేస్తున్నవి.

ప్రజాహితం కోరే సంస్థలు కావు కనుకనే, ప్రైవేటు సంస్థలు, ఈతి బాధలకు లోనయ్యే వ్యవసాయ బీమా పథకాన్ని అమలు చేసి రైతాంగాన్ని ఆదుకొనుటకు ముందుకు రావటం లేదు.

ఈ ప్రైవేటు సంస్థలు కేవలం 84 పట్టణాలు, నగరాలలో మాత్రమే శాఖలు కలిగి పట్టణ ప్రాంత ధనిక వర్గాల నుండి బీమా ప్రీమియం వసూలు చేస్తున్నాయి. గ్రామీణ ప్రాంతంలో వెనుకబడిన వర్గాల వద్దకు ఈ సంస్థలు వెళ్లిన దాఖలాలు లేవు. ప్రైవేటు బీమా సంస్థలు ప్రతి పట్టాకు సంవత్సరమునకు రూ.12,360 వసూలు చేయగా సామాజిక బాధ్యత కలిగిన జీవిత బీమా సంస్థ ప్రతి పట్టాకు రూ. 4690 మాత్రమే వసూలు చేయగలిగింది. దీనివల్ల ఆర్థికంగా బడుగు వర్గాల పట్టాలకు లభించే "క్రాస్ సబ్సిడీ" అవకాశం జాతీయ బీమా సంస్థలకు లభించదు. బడుగు వర్గాలకు బీమా సదుపాయం ఖరీదుతో కూడినపని అవుతుంది.

పోటీపేరున ప్రైవేటు సంస్థలకు బీమా వ్యాపారంలో వెన్న (క్రీమ్) లభించగా జాతీయ బీమా సంస్థలకు సామాన్య ప్రజానీకానికి సామాజిక భద్రత కల్పించే భారం పడింది. మన రాష్ట్ర ఆర్థిక ఇబ్బందులు తీర్చడానికి రూ.3,000 కోట్లు రుణం ఎల్.ఐ.సి అంద చేయగలిగింది. చట్టా వ్యాపారంలో లాభించినంతగా ప్రభుత్వ రుణం మీద ఆదాయం రాదు అనేది సత్యం. అయినా సామాజిక బాధ్యత నుండి 'ప్రభుత్వరంగం' తప్పుకోలేదు.

ఇప్పటికీ చిదంబరం ప్రతిపాదించిన విదేశీ పెట్టుబడుల పెంపుదల (26 శాతం నుండి 49 శాతంకు) కు తీవ్ర ప్రతిఘటన మొదలైనది. వామపక్షాలకు మద్దతుగా శ్రీ దేవ్‌గౌడ పార్టీ, శ్రీ ములాయం సింగ్ పార్టీలతో పాటు బి.జె.పి. కలిసింది. అందువల్ల మరల అందలమెక్కిన కాంగ్రెస్ పార్టీ మూర్ఖంగా విదేశీ పెట్టుబడుల పెంపుదల ప్రతిపాదన కలిగిన ఐఆర్‌డిఎ సవరణ బిల్లును పార్లమెంటు ముందుకు తీసుకొని వచ్చే సాహసం చేస్తే శృంగభంగం తప్పదు. ఉద్యోగులు, కార్మికవర్గం, వామపక్ష పార్టీలు తీవ్ర ఉద్యమాలు నిర్మించటానికి సమాయత్తమవుతున్నందున ఆర్థికమంత్రి చిదంబరం, ప్రధానమంత్రి మన్‌మోహన్ సింగ్ విజ్ఞత చూపి ఈ ప్రతిపాదనను ఉపసంహరించాలి.

## దేశంలో బీమా సాంద్రత జి.డి.పిలో ప్రీమియం శాతం

| సంవత్సరం | జనాభా (కోట్లు) | జాతీయ స్థూల ఉత్పత్తి రూ.కోట్లు | బీమా ప్రీమియం (రూ. కోట్లలో) | | | బీమా సాంద్రత బీమా ప్రీమియం/జనాభా | | | బీమా ప్రీమియం జి.డి.పి. లో శాతం | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | జీవిత | సాధారణ | మొత్తం | జీవిత | సాధారణ | మొత్తం | జీవిత | సాధారణ | మొత్తం |
| 2001-01 | 101.9 | 2104298 | 34898.7 | 10083.03 | 44981.5 | 342.48 | 98.99 | 441.47 | 1.66 | 0.48 | 2.14 |
| 2001-02 | 103.7 | 2296049 | 50094.45 | 12694.92 | 62789.37 | 483.07 | 122.42 | 605.49 | 2.18 | 0.55 | 2.73 |
| 2002-03 | 105.5 | 2451038 | 55738.11 | 14337.59 | 70075.70 | 528.32 | 135.90 | 664.22 | 2.27 | 0.58 | 2.86 |

(యోగక్షేమ మాగజైన్, జూలై 2004)

## 2008లో బీమారంగం-ఒక అంచనా

| విభాగం | 1998 | 2008 |
|---|---|---|
| జీవిత బీమా | 100శాతం ప్రభుత్వ రంగం | 70-80 శాతం ప్రభుత్వ రంగం<br>20-30 శాతం ప్రైవేట్ రంగం |
| సాధారణ బీమా | 100శాతం ప్రభుత్వ రంగం | 50-60 శాతం ప్రభుత్వ రంగం<br>40-50శాతం ప్రైవేట్ రంగం |

### జీవిత బీమా రంగంలోని ప్రైవేటు సంస్థలు విదేశీ సంస్థలతో కలిపి(ఉమ్మడి సంస్థలు):

| ఇండియన్ | ఫారిన్ |
|---|---|
| వైశ్యా | ఐఎన్‌జి లైఫ్ ఎన్సూరెన్స్(హాలెండ్) |
| సన్‌మార్ | ఎయంపి(ఆస్ట్రేలియా) |
| ఆదిత్య బిర్లా | సన్‌లైఫ్(కెనడా) |
| హెచ్‌డిఎఫ్‌సి | స్టాండర్డ్ లైఫ్(యుకె) |
| ఐసిఐసిఐ | ప్రూడెన్షియల్ లైఫ్(యుకె) |
| టాటా | అమెరికన్ ఇంటల్‌గ్రూప్(యుఎస్ఎ) |
| ఎస్‌బిఐ | కార్డిఫ్(ఫ్రాన్స్) |
| మెట్రో | మెట్రో లైఫ్(యుఎస్ఎ) |
| మాక్స్‌లైఫ్ | న్యూయార్క్ లైఫ్(యుఎస్ఎ) |
| అవీవా | అవీవా(ఆస్ట్రేలియా) |
| కోటక్ మహీంద్రా | ఓల్డ్ మూచ్యువల్(సౌత్ ఆఫ్రికా) |
| బజాజ్ | ఎలెయన్జ్(జర్మనీ) |

### సాధారణ బీమా రంగంలోని ప్రైవేటు సంస్థలు (ఉమ్మడి సంస్థలు):

| ఇండియన్ | ఫారిన్ |
|---|---|
| కోలమండలమ్ | ఎఎక్స్ఎ(ఫ్రాన్స్) |
| సుందరం ఫైనాన్స్ | రాయల్(యుకె) |
| టాటా | అమెరికన్ ఇంటల్ గ్రూప్(యుఎస్ఎ) |
| బజాజ్ | ఎలయన్జ్(జర్మనీ) |
| ఐసిఐసిఐ | లాంబార్డ్(యుకె) |
| హెచ్‌డిఎఫ్‌సి | సిహెచ్‌యుబిబి |
| ఇఫ్కో | టోకియో జనరల్(జపాన్) |
| రిలయన్స్ జనరల్ | లేదు |

# కోటారహిత జౌళి-వస్త్ర ఎగుమతుల వ్యవస్థ

- భూపతిరాజు సాంబశివరాజు

ప్రస్తుతం అమలులో ఉన్న కోటా (Quota) ఆధారిత వస్త్ర ఎగుమతుల వ్యవస్థ 2004 సంవత్సరాంతానికి ముగియనుంది. జౌళి-వస్త్ర-దుస్తులు ఎక్కువగా దిగుమతి చేసుకునే దేశాలయిన ఉత్తర అమెరికా పశ్చిమ యూరోపియన్ దేశాలు తమ దిగుమతి అవసరాలను వివిధ మూడో ప్రపంచదేశాలకు ఎగుమతి చేసుకునే అవకాశాలను నియంత్రించే దిశగా మల్టీఫైబర్ ఎగ్రిమెంట్ (MEA- Multi File Agreement) తయారు చేసి ఆ ఒప్పందాన్ని అంగీకరించే అనేక దేశాల చేత సంతకాలు చేయించింది. దానికి కట్టుబడి ఇండియా కూడా ఇన్నాళ్ళు వస్త్ర ఎగుమతులు చేస్తోంది. ప్రపంచ వాణిజ్య సంస్థ ఏర్పడ్డాక కుదిరిన నూతన ఒప్పందాల ప్రకారం ఈ కోటా వ్యవస్థని అంచెలంచెలుగా రద్దు చేయాలి. మొత్తానికి కోటాల వ్యవస్థ *2004* డిసెంబర్ అంతానికి రద్దయి, జనవరి *2005* నుండి కోటారహిత ఎగుమతి విధానం అమలులోనికి వస్తుంది.

**భారతదేశం-నూతన కోటా రహిత వ్యవస్థ:**

ఈ కొత్త వ్యవస్థ గురించి అన్ని కోణాలనుండి రాయాలంటే ఓ పెద్ద సీరియల్ వ్యాసమే ఔతుంది. అందుకని క్లుప్తంగా చర్చిద్దాం.

అనాదినుండి మనదేశం బలమైన, వైవిధ్యతతో కూడిన వస్త్రాల తయారీదారుగా పేరు ప్రఖ్యాతులు పొందింది. వ్యవసాయం తర్వాత స్థానం వస్త్రాల ఉత్పత్తి రంగానిదే. పాశ్చాత్యవలస వాదుల దారుణ దోపిడికి గురైన రంగం ఇది. భారతదేశ సహజ వికాశాన్ని, అభివృద్ధిని విచ్ఛిన్నం చేసి తమ వ్యాపారావసరాల కనుగుణంగా ఈ రంగాన్ని మార్చి వేయడం జరిగింది. స్వాతంత్ర్యానంతరం ఒకింత స్వతంత్ర జౌళి విధానం అమలులోకి వచ్చింది. సాంప్రదాయంగా వస్తున్న వస్త్ర ఉత్పత్తులనే మనం ఎగుమతి చేసుకుంటూ వస్తున్నాం. అభివృద్ధి చెందిన దేశాల్లో వచ్చిన మార్పులు మూలంగా అక్కడ దుస్తుల తయారీ ఫ్యాక్టరీలు మూతబడిపోవటం, దుస్తుల తయారీకి ఎక్కువ మంది పనివారు అవసరం కావడం, ఆ దేశాల్లో జీతాలు పెరిగి ఉత్పత్తుల ఖర్చు పెరిగిపోయి, పారిశ్రామికాధిపతులకు లాభాలు తగ్గిపోవడం మూలంగా వారు అక్కడి పరిశ్రమలను మూత పెట్టి వారి అవసరాలను వెనుకబడిన దేశాల్లో బాగా చవకగా తయారు చేయించుకుని దిగుమతి చేసుకోవడం మొదలు పెట్టారు. ఆ పాలసీలో భాగంగానే ఓ రకమైన వ్యవస్థీకృత గార్మెంట్ తయారీ ఫ్యాక్టరీలు మన దేశంలో రూపుదిద్దుకో సాగాయి. ఇవి చిన్న తరహా రంగంలోనే ఉంటూ వచ్చాయి. ఈ పరిశ్రమలు ప్రధానంగా ఢిల్లీ, ముంబాయి, మద్రాసులలో వేళ్ళూనుకొని ఇప్పుడు బెంగుళూరులో బాగా విస్తరించాయి. మన ఆంధ్రప్రదేశ్ స్థానం ఆ పటంలో ఎక్కడా లేదు.

**నూతన పరిణామాలు-వినూత్న మార్పులు**

మనదేశంలో ఇంతవరకు వస్త్ర ఎగుమతుల వ్యవహారమంతా కోటా వ్యవస్థ చుట్టూరా అల్లుకుని రాను రాను కొద్దిమంది వ్యాపారస్థుల కౌగిళ్ళలో బందీ అయిపోయింది. కొత్తగా ఈ రంగంలో ప్రవేశించేవారికి ఇది ఓ కీకారణ్యం. ఇక ఇప్పుడు రూపుదిద్దుకుంటున్న నూతన వ్యవస్థ వినూత్న మార్పులకు, పరిణామాలకు ద్వారాలు తెరుస్తుంది.

ఇందులో మొదట మెట్టు, గార్మెంటు తయారీని చిన్న తరహా పరిశ్రమల రిజర్వుడ్ లిస్ట్ నుండి తొలగించడం.

రెండవ మెట్టు అతిచిన్న నేత కార్మికుణ్నికూడా అంటే రెండు, మూడు పవర్ లూమ్‌లు ఉన్న జాబ్ వర్క్ పని వారిమీద కూడా ఎక్సైజ్ సుంకాన్ని విధించడం. తద్వారా అవి కనుమరుగైపోయే మార్గం ఏర్పాటు చేయడం. చిన్న తరహా పరిశ్రమలకు బ్యాంకుల్లో అప్పులు పుట్టకుండా బ్యాంక్ యాజమాన్యాలకి కేంద్ర ప్రభుత్వం లోపాయికారీ ఆజ్ఞలు జారీ చెయ్యడం. చిన్న తరహా పరిశ్రమలు; సంఘటితరంగంలో ఉన్న, రాబోతున్న బడా పరిశ్రమల ఎదుగుదలకు ఓ ప్రతిబంధకంగా తయారౌతున్నాయనే వాదనను సమర్థిస్తూ కేంద్ర ప్రభుత్వం ఓ నిర్ణయానికి రావడం- ఇవన్నీ ఎన్‌డిఎ ప్రభుత్వ హయాంలో చురుకుగా ముందుకు నెట్టడం జరిగింది. ఈ పాలసీకి వ్యతిరేకంగా దేశ వ్యాప్తంగా లక్షలాది పవర్ లూమ్‌లు నడిపే చిన్న వ్యాపార సంస్థలు 2-3 నెలలు బంద్ చేసి ఉత్పత్తిని ఆపివేసారు. గుజరాత్, తమిళనాడు, ఆంధ్ర ఇంకా ఇతర చోట్ల ఎన్‌డిఎ ప్రభుత్వాల ఓటమికి ఈ ప్రభుత్వ వ్యతిరేకత బలంగానే పనిచేసింది. ఇప్పుడు కేంద్రంలో ఉన్న కొత్త ప్రభుత్వం ఎక్సైజ్ సుంకాలను చిన్నకారు ఉత్పత్తి దారులపై రద్దు చెయ్యడమే కాక చాలా మార్పులు తీసుకు వచ్చింది. ఇది కొంత వరకు ఊరట కలిగించే మార్పు.

అయితే అమెరికా, యూరప్ దేశాలలోని మార్కెట్లలో చోటు చేసుకుంటున్న పరిణామాల మూలంగా ఇప్పటికే అక్కడ వస్త్ర పరిశ్రమ చతికిలబడిపోయింది. ఏవో కొన్ని స్పెషాలిటీ, నూతన టెక్నాలజీ సంబంధిత పరిశ్రమలు ఉన్నా చిన్నా, పెద్ద జౌళి పరిశ్రమలు ఇదివరకే మూతబడిపోవడమో, ఇంకా మిగిలి ఉన్నవి మూతకు గురికావడమో జరుగుతోంది. వారి మార్కెట్ అవసరాలకి వారి లాభాల పటిష్ఠతకు అనుకూలంగా మనలాంటి అనేక దేశాలలో వారు ఈ రంగాన్ని మార్పులకు గురిచేస్తున్నారు. స్వతంత్ర ఆర్థిక స్వావలంబన లేని ఈ వెనుకబడిన దేశాలు అమెరికా, యూరప్‌కి అనుగుణంగా పనిచేస్తున్నాయి.

**ఎవరికి నష్టం-ఎవరికి లాభం?**

ఇండియా, చైనా, పాకిస్థాన్ వంటి దేశాలు మినహా ఇతర ఆసియా, ఆఫ్రికా, లాటిన్, అమెరికా దేశాలు ఎన్నో ప్రస్తుతం దుస్తుల తయారుచేసి ఎగుమతి చేస్తున్నప్పటికి, వాటికి పునాదిలో అవసరమయిన టెక్స్‌టైల్స్ రంగంలో అత్యవసరమయిన నూలు, రంగుల ఉత్పత్తి, బట్టల ఉత్పత్తి అసలు లేక పోవడమో చాలా



### నిరంతరం శ్రమించే రైతన్నల కోసం



# రుణం చెల్లింపులో సౌలభ్యం
# బ్యాంకుల ద్వారా పరపతి సౌకర్యం

రుణభారంతో విలవిలలాడుతున్న రైతాంగాన్ని ఆదుకొనేందుకు రాష్ట్ర ప్రభుత్వం ముందుకు వచ్చింది. నానాటికి పెరుగుతున్న వడ్డీ రైతన్నకు భారంగా మారింది. అసలు కన్నా వడ్డీ ఎక్కువై అమాయక రైతులను కబళిస్తోంది. అందుకే రుణం చెల్లింపులో సౌలభ్యం కలిగిస్తూ ప్రాణత్యాగం చేసుకొనే దారుణం నుండి రైతును కాపాడేందుకు ప్రభుత్వం ఈ ప్యాకేజీని అమలు చేస్తోంది.

## ప్యాకేజీలో ఉన్న ప్రత్యేకతలు

- వర్షాలు పడక, పంటలు పండక, అల్లాడుతున్న రైతాంగాన్ని ఆదుకోవాలని, అలాగే అన్ని ప్రాంతాల రైతులకు విరివిగా అప్పులివ్వాలని భారతీయ రిజర్వుబ్యాంకు, కేంద్ర మరియు రాష్ట్ర ప్రభుత్వాల ఆదేశానుసారం రాష్ట్రస్థాయి బ్యాంకర్ల సమితి నిర్ణయించింది.
- గడిచిన 5సం॥ కాలంలో వరుసగా రెండు సంవత్సరములు రాష్ట్ర ప్రభుత్వం కరువు మండలాలుగా ప్రకటించి వుంటే, ఆ ప్రాంత రైతుల రుణాలను వాయిదా వేస్తారు. ఈ మండలాల్లో మార్చి 2004 నాటికి పంట ఋణాల్లో బాకీ (అసలు+వడ్డీ) మరియు ఇతర వ్యవసాయ కాలపరిమితి రుణాలు కలిపిన మొత్తాన్ని 5సంవత్సరాలలో చెల్లించే విధంగా వాయిదా వేస్తారు. ఈ 5సంవత్సరాల కాలంలో మొదటి రెండు సంవత్సరములు రైతు ఏమీ చెల్లించకుండా మొత్తం చివరి 3సంవత్సరాలలో చెల్లించే విధంగా వాయిదాల తీర్మానం, వాయిదా వేసిన మొత్తానికి ప్రస్తుతం అమలులో వున్న వడ్డీ విధిస్తారు. వాయిదా వేసిన రైతులందరికీ మళ్ళీ పంట రుణాలు మంజూరు.
- ఇంతవరకు రుణము పొందని రైతులు తమతమ పట్టాదారు పాసు పుస్తకాలు, భూమి రికార్డులు, పత్రములతో సంబంధిత బ్యాంకు మేనేజరుని కలిసి అప్పుకోసం దరఖాస్తు చేసుకోవచ్చు.
- రాష్ట్రంలో మొట్టమొదటి సారిగా రుణాలు చెల్లించలేక ఆత్మహత్యలు చేసుకున్న రైతు కుటుంబాలకు, ఒన్‌టైమ్ సెటిల్‌మెంట్ క్రింద రూ.50,000/-ల మొత్తం వరకూ వడ్డీ/అసలు మాఫీ.

- ఇది రాష్ట్రప్రభుత్వం రైతులకు అందిస్తున్న సహాయం. విలువైన జీవితాలను ఉరితాళ్ళకు బలిచేసుకోవద్దు.
- మీ ఆత్మహత్యలతో మీ భార్యాబిడ్డల రుణానుబంధాలు తీరుతాయనుకోవద్దు.
- ఈ అవకాశాన్ని అందుకోండి, కొత్త రుణాలను పొందండి.

ఈ ప్రభుత్వం.. ప్రజల ప్రభుత్వం.. రైతుల ప్రభుత్వం !

**కృష్ణ పుష్కరాలు - ఆగష్టు 28 నుండి సెప్టెంబర్ 8,2004 వరకు**

జారీచేసినవారు : సమాచార పౌరసంబంధాల శాఖ

బలహీనరగానో ఉండటం మూలంగా అటువంటి దేశాలలో సంక్షోభం, ఏర్పడే ప్రమాదం ఉంది. అమెరికా, యూరప్ తన వస్త్ర అవసరాలను ఈదేశాలలో ఎక్కడ శ్రామికుల శ్రమ చవకగా దొరుకుతుందో అక్కడ తయారు చేయించుకుంటున్నాయి. లాటిన్ అమెరికా, ఆఫ్రికాలలో అయితే అమెరికాలో తయారయిన ముడి సరుకును వాడే కండిషన్ మీద వస్త్ర ఉత్పత్తులు జరిపించి, కోటాలు లేకుండా దిగుమతి చేసుకుంటోంది.

ముఖ్యంగా లాటిన్ అమెరికా దేశాలు తనకు దగ్గర అవడం మూలంగా ఈ పద్ధతిలో తనకు ఉపయోగకరంగా ఉత్పత్తులు చేయించుకుని దిగుమతి చేసుకుంటోంది. ఇప్పుడు ఈ కోటాలు లేని ఓ కొత్తశకం ఆరంభంలో జరిగే మార్పుకు ముఖ్యంగా అమెరికా మార్కెట్టు చాలా ఒత్తిడికి లోనౌవుతోంది. ముందుగానే ఈ పరిణామాలు అంచనా వేసిన అమెరికన్ వస్త్ర దిగుమతి దారులు చైనా ముందు క్యూ కట్టారు. చైనాలో త్వరితగతిన జౌళి పరిశ్రమ ఆధునీకరణ జరగడం, టెక్నో-కమర్షియల్‌గా అక్కడ ప్రభుత్వం మారిపోవడం, మార్కెట్లు తెరవడం, విదేశీ పెట్టుబడుల ప్రవాహాన్ని స్వాగతించడం, క్రమశిక్షణాయుతంగాను, చవకగా పని చేసే శ్రామికులు అక్కడ ఉండటం, చైనా పాలకులకు-అమెరికా వ్యాపారస్థులకు అంతర్గత లావా దేవీలలో అవగాహనలు కుదరడం వీటన్నిటి మూలంగా ఊహించని రీతిలో చైనా ఈ రోజు వస్త్ర-జౌళి ఎగుమతుల రంగంలో తిరుగులేని స్థానాన్ని, సింహభాగాన్ని చేరుకుంది.

**అందరి జుట్టు అమెరికా, యూరప్ చేతుల్లో:**

అమెరికాకు, యూరప్‌కు పదునయిన ఆయుధాలు ఉండనే ఉన్నాయి. జౌళి-వస్త్ర దిగుమతులపై కష్టమ్ సుంకాలు, ఏంటీ డంపింగ్ సుంకాలు, ఇంకా పర్యావరణ రక్షణ పేరు మీద, క్వాలిటీ పేరుమీద, కంప్లయన్స్ పేరు మీద విధించే రకరకాల నిబంధనల ద్వారా ఎప్పుడు వాతలు పెట్టాలో వాటికి బాగా తెలుసు. ఇటువంటి చర్యల ద్వారా అవి వాటి మార్కెట్లను కాపాడుకుని మూడు ప్రపంచ దేశాల మార్కెట్లపై తమ అధీనంలో ఉన్న లేక తమపై ఆధారపడి పనిచేస్తున్న ఆయా దేశాల ప్రభుత్వాల ద్వారా పెట్టుబడి సాధించుకో గల్గుతాయి.

ఉదాహరణకి మనదేశంలో గవర్నమెంటు టెక్స్‌టైల్ పాలసీలను తమ వ్యాపారాలకి అనుగుణంగా మార్చుకోగల్గుతారు. తమ తమ దేశాల్లో మూతబడిపోయిన పరిశ్రమలలోని జౌళి నేత యంత్రాలను మంచి రేట్లకే మన దేశంలోకి దిగుమతి చేయడాన్ని ఆమోదింప చేయిస్తారు. ఇలా ఎన్నో పాతవి, అరిగిపోయిన యంత్రాలు మన దేశంలోకి కుప్పలుగా దిగుమతి చేసుకోబడుతున్నాయి. మన గవర్నమెంటు ఏర్పాటు చేసిన "టెక్నాలజీ అభివృద్ధి ఫండ్ స్కీమ్" లో దీనికి బాగా అవకాశమిచ్చారు. అలాగే ఆధునికీకరణ పేర, చాలా ఖరీదైన అధునాతన యంత్రాలను అభివృద్ధి చెందిన దేశాలనుండి మనం దిగుమతి చేసుకోవాల్సిందే. దేశీయంగా కొద్దిపాటిగానే మన టెక్స్‌టైల్, గార్మెంట్ తయారీ చేసే యంత్రాలు ఉత్పత్తి అవుతున్నాయి. అటువంటి అధునాతన యంత్రాలు లేకపోతే ఎగుమతి ఆర్డర్లు పొందడం చాలా కష్టతరం. దిగుమతిదారులు విధించే కంప్లయన్స్ విధానాలు సంక్లిష్టంగా వుంటాయి. వీటికి చాలా ఎక్కువ పెట్టుబడి పెట్టాల్సినవి కావటంతో అందరికి సాధ్యం కాదు. బడా పారిశ్రామిక వేత్తలకే సాధ్యం దీనికనుగుణంగానే గార్మెంట్ ఉత్పత్తిని చిన్నపరిశ్రమల పట్టిక నుంచి తొలగించారు.

మనదేశానికి ఇప్పటివరకు ఉన్న స్థానం ఈ కొత్త విధానంలో మెరుగు పడవచ్చు. అయితే చైనాతో పోలిస్తే అనేక విషయాల్లో వెనకబడి ఉండటం మూలంగా లబ్ధిపొందాల్సిన దాని కన్నా ఎన్నో అవకాశాలున్నా వెనకబడే ఉంది. దీనికి చాలా కారణాలున్నాయి.

అయితే జౌళి-వస్త్ర పరిశ్రమ రంగంలో ఆధునీకరణ కొంత జరుగుతోంది. కాబట్టి మొత్తానికి కొంతమేరకు మేలు జరుగుతుంది. అయితే చిన్న పరిశ్రమలకు తావులేకుండా పోతుంది. ఈ రంగంలో చిన్న పరిశ్రమలు నిలబడలేవు. కొట్టుకుపోతాయి. చేనేత పరిశ్రమ దీనివల్ల ఏమయినా లబ్ధిపొందుతుందా అనేది ప్రశ్నార్థకమే.

చైనా,పాకిస్థాన్, టర్కీ, దేశాల నూతన పరిస్థితుల్లో చాలా లబ్ధిపొందుతాయి. ఇప్పటికే ఇవి ప్రధాన పాత్ర పోషిస్తున్నాయి. ఇంకా మేలయిన స్థాయికి చేరుకుంటాయి. లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఇతర ఆసియా దేశాల్లో దుస్తుల తయారీ పరిశ్రమలు చాలామట్టుకు దెబ్బతినిపోయే సూచనలు కన్పిస్తున్నాయి. ముఖ్యంగా చిన్న పరిశ్రమలు, ఓ మాదిరి పరిశ్రమలు కూడా మూతబడిపోయి రమారమి 3 కోట్లమంది పనివారు ఉపాధి కోల్పోయే ప్రమాదం ఉందని అమెరికా నుండి వెలువడే "బిజినెస్ వీక్" అనే పత్రిక అంచనా లెక్క కట్టింది. ఇది ఓ విషాదం.

అమెరికన్, యూరోపియన్లు దిగుమతి వ్యాపారులుమట్టుకు చైనా, ఇండియా, పాకిస్థాన్, టర్కీ, కొన్ని తూర్పు యూరప్ దేశాల నుండి తక్కువ ధరలకు సరుకులు దిగుమతి చేసుకుని వారిని లాభాలు గడించే అవకాశాన్ని మెరుగుపరచు కుంటున్నారు. తమ దేశాల్లో తయారు చేసి అమ్ముకునే పరిస్థితి లేదు. చవకగా ఉత్పత్తులను బయట నుండి తెచ్చుకొని సులభంగా ఎక్కువ లాభాలు రాబట్టుకోవచ్చు. అంటే చివరికి ఏం జరుగుతోంది? కొంతమంది ప్రజలకు కొన్ని చోట్ల మేలు జరిగితే ఎంతోమంది ప్రజలకు ఎన్నో చోట్ల నష్టం జరుగుతోంది. అమెరికా వ్యాపారులకు-దళారులకు లాభాలపంట. ✻

*Owned, Printed and Published by V.Hanumantha Rao at D.No.8-3-898/22, Road No.3, Nagarjuna Nagar, Hyderabad-5000 073 Ph: 23748672, DTP at Samata Graphics, Hyderabad. Printed at Akruti, Chikkapalli, Hyderabad. Editor: V.Hanumantha Rao*